# నవయుగ వైతాళికుడు

శ్రీ కందుకూరి వీరేశలింగం 125 వ జన్మదిన

సంస్మరణ సంచిక



# నవయుగ వైతాళికుడు

## శ్రీ కందుకూరి వీరేశలింగం 125 వ జన్మదిన

## సంస్మరణ సంచిక



**15-7-1974**



రాష్ట్రస్థాయి ఉత్సవసంఘం

హైదరాబాదు

## సంస్మరణ సంచిక ఉపసంఘం

**సభ్యులు :** శ్రీ కోదాటి నారాయణరావు

శ్రీ వి. రామచంద్రన్

శ్రీ జె. బాపురెడ్డి

శ్రీ గులాం యాసిన్

శ్రీ ఎం. ఎల్. నరసింహారావు

కుమారి వాసిరెడ్డి సీతాదేవి

డా॥ అక్కిరాజు రమాపతిరావు

**కన్వీనర్ :** శ్రీ ఎల్. మాలకొండయ్య ఎం. ఏ., ఐ. ఏ. ఎస్.

**ముఖచిత్రం** · 'యోజన' (తెలుగు) సౌజన్యంతో

**ముద్రణ :** నాట్యకళ ప్రెస్, హైదరాబాదు.

# శ్రీ కందుకూరి వీరేశలింగం 125 వ జన్మదిన రాష్ట్రస్థాయి ఉత్సవసంఘం

**అధ్యక్షులు :** **శ్రీ మండలివెంకటకృష్ణారావు,**
విద్యాశాఖమంత్రి.

**ఉపాధ్యక్షులు :** **శ్రీ బత్తిన సుబ్బారావు,**
సహకారశాఖ మంత్రి.

**శ్రీ ఖాట్టం శ్రీరామమూర్తి,**
సాంఘిక సంక్షేమశాఖ మంత్రి.

**శ్రీమతి ఎం. లక్ష్మీదేవి,**
స్త్రీ, శిశు సంక్షేమశాఖ మంత్రిణి.

**సభ్యులు :** శ్రీ వి. ఎస్. మూర్తి, ఎం. పి.
శ్రీ డి. మునిస్వామి, ఎం. ఎల్. ఏ.
శ్రీమతి కొండా పార్వతీదేవి, ఎం. ఎల్. సి.
శ్రీమతి కనకరత్నమ్మ, ఎం. ఎల్. సి.
శ్రీ పి. రాజగోపాల నాయుడు, ఎం. ఎల్. సి.
శ్రీ ఎన్. వి. జగన్నాథం, ఎం. ఎల్. ఏ.
శ్రీ అక్కల కోటయ్య, ఎం. ఎల్. సి.
శ్రీ వి. సత్యనారాయణ, ఎం. ఎల్. ఏ.
శ్రీ టి. పురుషోత్తమరావు, ఎం. ఎల్. ఏ.
శ్రీ పి. వి. రమణ, ఎం. ఎల్. ఏ.
శ్రీ కె. వీరాస్వామి
శ్రీమతి ఎం. కమల, ఎం. ఎల్. సి.
జస్టిస్ శ్రీ ఆవుల సాంబశివరావు
శ్రీ ఐ. వీరభద్రరావు

శ్రీ ఎం. సత్యనారాయణరావు
శ్రీమతి అద్దేపల్లి వివేకానందాదేవి
శ్రీ చదలవాడ వెంకటరావు
శ్రీ కోదాటి నారాయణరావు
శ్రీ ఎస్. బి. పి. కె. సత్యనారాయణరావు
శ్రీ ఊటుకూరి నరసింహారావు
శ్రీ నార్ల వెంకటేశ్వరరావు
శ్రీ డి. జె. రామారావు
శ్రీ ఎం. ఎల్. నరసింహారావు
శ్రీ దాశరథి
శ్రీ కె. రామశాస్త్రి (తారకం)
శ్రీ వి. రామచంద్రన్
శ్రీ కె. పురుషోత్తమనాయుడు ఐ. ఏ. ఎస్.
శ్రీమతి బి. శకుంతల ఎం. ఏ.
శ్రీ లవణం
శ్రీమతి హేమలతాలవణం

**కార్యదర్శి :** శ్రీ ఎల్. మూలకొండయ్య ఐ. ఏ. ఎస్.

# కృతజ్ఞతలు

తెలుగుసీమలో సంఘ సంస్కరణ శంఖారావాన్ని వినిపించిన నవయుగ వైతాళికుడు శ్రీ కందుకూరి వీరేశలింగం గారి 125 వ జయంతి ఉత్సవాలను సముచితరీతిని నిర్వహించే నిమిత్తం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు రాష్ట్రస్థాయి ఉత్సవసంఘాన్ని నియమించారు. ఈ సంఘానికి విద్య, సాంస్కృతిక వ్యవహారాలశాఖ మంత్రి శ్రీ మండలి వెంకటకృష్ణారావు గారు అధ్యక్షులు. రాష్ట్రమండలి వివిధ ప్రాంతాలకు చెందిన ప్రముఖులు దీనిలో సభ్యులుగా వున్నారు. వీరేశలింగం గారి సంఘ సంస్కరణలను అమలు పరచేందుకు దోహదాన్నిచ్చి, ప్రోత్సహిస్తున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి ముఖ్యంగా ముఖ్యమంత్రి గారికి, ఈ సంఘం కృతజ్ఞతలు అందజేస్తున్నది.

శ్రీ వీరేశలింగంగారి సేవాకార్య కలాపాలకు ప్రధాన కేంద్రంగా వర్ధిల్లిన రాజమహేంద్రవరంలో 16-4-1974 వ తేదీన ఈ సంఘం ఆధ్వర్యంలో జయంత్యుత్సవాలు వైభవోపేతంగా జరిగాయి. రాష్ట్ర రాజధాని హైదరాబాదులో 27-5-74 తేదీన శ్రీ వీరేశలింగం గారి 55 వ వర్ధంత్యుత్సవాలు ఘనంగా నిర్వహించబడ్డాయి.

సాంఘిక, సాహిత్య రంగాలలో ఎనలేని సేవచేసిన శ్రీ వీరేశలింగం గారి గౌరవార్థం భారత ప్రభుత్వం వారు ప్రత్యేక తపాల బిళ్లను ప్రచురించారు. ఇందుకు భారత ప్రభుత్వానికి, ప్రత్యేకంగా కమ్యూనికేషన్స్ శాఖామాత్యులు శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి గారికి రాష్ట్రస్థాయి ఉత్సవసంఘం తన కృతజ్ఞతలు తెలియజేస్తున్నది.

ఈ ప్రత్యేక తపాలా బిళ్లను హైదరాబాదు రవీంద్రభారతిలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు 15-7-1974 సోమవారం, ఉదయం 10-15 గం॥లకు విడుదల చేస్తున్న శుభ సందర్భాన్ని పురస్కరించుకొని ఉత్సవసంఘం సంస్మరణ సంచికను ప్రచురిస్తున్నది. సంచికకు తమ సందేశాలు ఇచ్చిన పెద్దలకు, తమ రచనలు పంపిన కవులకు, వ్యాసకర్తలకు కృతజ్ఞతాంజలులు ఘటిస్తున్నాం.

సంచికకు ప్రకటనలిచ్చిన సంస్థలవారికి మా ధన్యవాదాలు.

ఈ సంచిక సంకలనంలో తోడ్పడిన శ్రీ గోవిందరాజు రామకృష్ణరావుకు తదితర మిత్రులకు మా కృతజ్ఞతలు.

ఎల్. మాలకొండయ్య ఐ. ఏ. ఎస్.
రాష్ట్రస్థాయి ఉత్సవసంఘ కార్యదర్శి.

# విషయసూచిక

జలగం వెంగళరావు
(ముఖ్యమంత్రి)



హైదరాబాదు
17-5-1974

# సందేశము

నవయుగ వైతాళికుడు, నవ్యాంధ్ర నిర్మాత శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు గారు "దక్షిణదేశపు విద్యాసాగరుడు" గా కీర్తింపబడిన గొప్ప సంఘ సంస్కర్త. సంఘంలో ప్రవేశ్యాన్ని పాతుకుపోయిన దురాచారాలను, మూఢవిశ్వాసాలను సమూలంగా పెకలించి, వివేకవర్ధని పత్రికద్వారా ప్రజల్లో ప్రబోధ ప్రచారాలు గావించి సంఘ వ్యవస్థను తీర్చిదిద్ది, జాతి మనుగడకు జీవంపోసిన యుగపురుషుడు. స్త్రీ పునర్వివాహానికీ, స్త్రీ విద్యావ్యాప్తికీ తన సర్వస్వాన్ని ధారపోసిన మహనీయుడు. హితకారిణీ సమాజాన్ని స్థాపించి స్త్రీ జనాభ్యుదయానికి మహోద్యమాన్ని నడిపిన చిరస్మరణీయుడు. తెలుగువారికి రాజా రామమోహనరాయ్ వంటివాడు. సంఘసంస్కరణోద్యమంలో, సాహిత్యాన్ని ఆయుధంగా వాడుకున్న అభ్యుదయభావుక చక్రవర్తి వీరేశలింగంగారు. తెలుగులో జీవిత చరిత్ర, నవల, నాటకం మొదలగు ఆధునిక ప్రక్రియలకు పునాదులువేసి ఆధునికాంధ్ర సాహిత్య చరిత్రలో అపూర్వమైన కీర్తిప్రతిష్ఠలు ఆర్జించిన ప్రముఖ సాహితీమూర్తి. తెలుగుదేశపు కీర్త్యాకాశంలో మిలమిల మెరుస్తూ వెలిగిన వేగుచుక్క. ఇటువంటి మహనీయుని ౧౨౬ వ జయంతిని రాష్ట్రస్థాయిలో నిర్వహించడానికి ప్రభుత్వం సంకల్పించింది. ఆయన అడుగుజాడల్లో నడిచి తెలుగుజాతి ధైర్యసాహసాలతో సమైక్యతా సామరస్యాలతో పురోగమిస్తుందనీ, బంగారు భవిష్యత్తుకు బాటలు వేసుకుంటుందనీ, ఆశిద్దాం.

—జలగం వెంగళరావు

K. BRAHMANANDA
REDDI,
Minister of Communica-
tions



5, Janpath,
New Delhi - 11.
Date July 6, 1974.

## MESSAGE

I am very happy to know that the Government of Andhra Pradesh have constituted a State Level Committee for celebrating 125th Jayanti of late Shri Kandukuri Veeresalingam, the great Social reformer of South India. But for his measures of far-reaching social reforms brought over a century now, the Telugu speaking people would not have been in the present stage of progress in social and cultural fields.

I am particularly happy to be associated with the bringing out of the commemoration stamp to honour this great son of our State.

I send my best wishes for the success of the function,

**—K. Brahmananda Reddi**

మండలి వెంకటకృష్ణరావు
(ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖమంత్రి)



హైదరాబాదు
10-7-1974

తెలుగుదేశంలో భావ విప్లవాన్ని తీసికొని వచ్చినవారు కందుకూరి వీరేశలింగం. ఆనాడుసంఘంలో తనఎదుట కన్పించిన ఎన్నో అక్రమాలను, అన్యాయాలను రూపు మాపడానికి ఆయన ఎంతగానో కృషి చేశారు. సాహిత్యాన్ని బలమైన ఆయుధంగా నుపయోగించుకొని అనేక రంగాలలో సంఘ సంస్కరణాన్ని సాధించారు. వీరేశలింగం గారికి పూర్వంగాని, అటుతరువాత గాని సాహిత్యాన్ని సంఘ సంస్కరణకోసం బలమైన ఆయుధంగా గైకొని మహత్తరకృషి సలిపిన వారు ఆయనతో దీటుగా సమానమై నిలిచిన వారు లేరనియే చెప్పాలి.

వీరేశలింగంగారి కాలంవరకూ జమీందారి యుగం. ఆ యుగ లక్షణాలే కళల్లోనూ సాహిత్యంలోనూ విరివిగా ప్రతిఫలిస్తూ ఉండేవి. వీరేశలింగం పంతులుగారు సాహిత్యంలో ప్రజాస్వామిక యుగానికి నాంది పలికి యుగకర్తయై భాసించారు. పండితులకు మాత్రమే సీమితమై ఉద్దేశించే పద్యకావ్యాలను వదలిపెట్టి పామరులు సైతం చదివి అర్థంచేసుకోగల వచన రచనలు ప్రారంభించారు. ఆయన నూటికి పైగా గ్రంథాలు వ్రాస్తే అందులో ఎనభై కి పైగా వచన రచనలే ఉన్నాయి. తెలుగు సాహిత్యంలో అంతకు పూర్వంలేని, నవల, స్వీయచరిత్ర, జీవితచరిత్ర, కవుల చరిత్ర, సాహిత్య విమర్శ మొదలైన ప్రక్రియలను మొదటిసారిగా తీసికొనివచ్చి "గద్యతిక్కన" యని కీర్తి గడించారు.

ప్రజల భావాలలోనూ, ఆలోచనా సరళిలోనూ, గొప్పసంచలనాన్ని తీసికొని వచ్చారు. అంతకుపూర్వం అందరూ నమ్ముతూ వచ్చిన మౌఢ్య దురాచారాలన్నింటినీ బాహాటంగా ఖండించారు. వేశ్యావృత్తి, అధికారాలలో లంచగొండితనం, బాల్యవివాహాలు, వృద్ధ

వివాహాలు, కన్యాశుల్కం, మొదలైన దురాచారాలు నిర్మూలించడానికి నిర్విరామంగా పోరాటం సాగించారు. శకునాలు, ముహూర్తాలు, జ్యోతిష్యం, దయ్యాలు, భూతవైద్యాలు, మొదలైన మూఢనమ్మకాలు ప్రజల్లో లేకుండా చేయడానికి తన రచనల ద్వారా, ఉపన్యాస పరంపరల ద్వారా ఎంతగానో కృషి చేశారు.

స్త్రీ పునర్వివాహాలను తలపెట్టి, బాల వితంతువుల జీవితాలకు వెలుగును ప్రసాదించారు. ఆ సందర్భంగా ఆయన చూపిన సాహసం, అసామాన్యమైనది. బలవంతులు అధికారులు, అధిక సంఖ్యాకులు ఆయనకు వ్యతిరేకంగా పనిచేసినా ఏమాత్రం భయపడలేదు. ఎందరి చీకటిండ్లలోనో వీరేశలింగ మహానుభావులు దీపాలు వెలిగించారు.

వెనుకబడిన ప్రజలకోసం, వారి విద్యావికాసాలకోసం ఆయన రాత్రిపాఠశాలలు నడిపారు. స్త్రీలకు విద్యయెడల ఆసక్తి కలిగించాలనీ ఎన్నో గ్రంథాలు రచించారు. బాలికా పాఠశాలలు నెలకొల్పారు.

అరవై సంవత్సరాల వయసున కూడా వీరేశలింగం గారిలో సంఘసంస్కరణ భావాల తీవ్రత తగ్గలేదు. సర్వమానవ సౌభ్రాతృత్వాన్ని చాటడానికై ఆయన కులచిహ్నమైన జందెమును అరవై ఏళ్ళు నిండిన తరువాత విసర్జించడం జరిగింది. దేనినైతే ప్రగాఢంగా ఆయన నమ్మాడో దానిని తప్పక ఆచరించి చూపడమే ఆయనలోని విశిష్టత.

సంఘసంస్కరణ కార్యక్రమంలో ఆయన ఎటువంటి రాజీలకు తలవొగ్గేవాడు కాదు. బాల్యం నుంచీ కూడా నిర్భయంగా తన మార్గాన తాను నడచారు.

పంతులుగారు యిటు రచయితగా అటు సంఘ సంస్కర్తగా తెలుగుదేశంలో వారు సాధించిన సత్ఫలితాలు తరతరాలను ప్రభావితం చేస్తాయి.

పుస్తకాలలోనే దీర్ఘంగా నిద్రపోతున్న నీతిని, ప్రజల నిత్యజీవితంలో మేల్కొల్పిన వైతాళికుడు కందుకూరి. తెలుగు దేశం, తెలుగు సంఘం అన్నిరంగాలలో ముందంజ వేయాలనీ వారు ఆశించారు. అధర్మంపైన అన్యాయంపైన, అక్రమంపైన మహాయుద్ధాన్ని ప్రకటించి, ధర్మపక్షపు సైన్యాధిపతిగా పోరాటం సాగించారు.

వీరేశలింగం పంతులుగారి పవిత్రకృషిలో విద్యార్థుల అండదండలు వీరికి ఎంతగానో లభించాయి. వాళ్ళ హృదయాంతరాళాలలో విప్లవభావాలను ప్రవేశపెట్టి, ఒక నూతన వ్యవస్థపట్ల వాళ్ళకు ఆసక్తిని కలుగజేశారు. భారతదేశంలో రాజారామ్మోహన రాయలవారు ఎటువంటి మార్పులను తేవాలని కృషి చేశారో, ప్రబోధించారో వాటిని తెలుగు దేశంలో వీరేశలింగంగారు ప్రచారంచేసి కొంత వరకు సాధించారు.

వీరేశలింగంగారి 125 వ జయంతిని పురస్కరించుకొని ఆ మహనీయుణ్ణి సంస్మరించుకొంటున్న ఈ శుభసందర్భంలో వీరేశలింగం గారు ఆశించిన విలువలకోసం, పోరాడిన సంస్కరణలకోసం గట్టిగా కృషి చేయడమే మన పవిత్ర కర్తవ్యం.

B. SUBBA RAO
Minister for Co-operation



Hyderabad,
Dated 8th April, 1974

## MESSAGE

I am extremely happy that the 125th Birth Day of Kandukuri Veeresalingam is being celebrated in a big way. Sri Veeresalingam is one of the Country's Social Reformers. He could achieve many things by moral persuasion. It is necessary that the present generation should know about the life and work of the great Social Reformer.

The Birth Day celebrations will certainly achieve this objective.

**—Bathina Subba Rao**

# యుగపురుషుడు కందుకూరి

## జె. వీరాస్వామి

కందుకూరి వీరేశలింగంగారు యుగపురుషుడు.

ఆయన భావాలు, సంఘసంస్కరణాభిలాష దానికై ఆయన సలిపిన కృషి, మహోన్నతమైనవి. 1848లో ఆయన పుట్టేనాటికి, ఆంధ్రదేశంలో సాంఘిక వ్యవస్థ, అస్తవ్యస్తంగా ఉండేది. మూఢాచారాలు, మూఢవిశ్వాసాలు, విచ్చలవిడిగా సంఘంలో స్థానం ఏర్పరచుకొని, అమాయకులైన వ్యక్తులనుపట్టి ఆడించేవి. ఎవరికీ ఏ రుగ్మత వచ్చినా, ముందు వైద్యుల సలహాకు వెళ్ళకుండా, భూతవైద్యం చేయించుకోవడం, రక్షరేకులు కట్టించుకోవడం, పరిపాటిగా ఉండేది. ప్రతి సామాన్య విషయానికి, మంచిచెడ్డలు పంచాంగరీత్యాచూచుకొని, శకునాలు చూచుకొని, దిక్కులు చూచుకొని, కార్యక్రమం ప్రారంభించేవారట. అప్పటివారికి, కార్యనిర్వహణమీద మమకారం, ఏకాగ్రతలకంటే, తిథులమీద శకునాలమీద, వారుతమశక్తిని, విలువైన కాలాన్ని, అనవసరంగా వ్యయపరిచేవారు. పరిసరాల శుభ్రత ఎలాగున్నా, మడి, తడి, పూర్వాచారం ఉంటే, భగవంతునికి దగ్గరగా వెడుతున్నట్లు భావించే పద్ధతి, సాంఘిక కట్టుబాటుగా చెలామణి ఔతుండేది వీటికన్నిటికీ, తలమానికంగా, స్త్రీ పునర్వివాహ నిషేధం ఉండేది. బాల్యవివాహాలు అప్పటికి ఎక్కువగా ఆచరింపబడేవి.

బాలికలు వ్యక్తురాండ్రు అయిన తర్వాత వివాహాలుచేస్తే తప్పుగా భావించడం, అలాంటి వివాహాలు చేసిన కుటుంబాలవారిని వెలివేయడం, న్యూనతగా చూడడం కద్దు. పాపపరిహారం కొరకు, ప్రాయశ్చిత్తం చేయించుకోవడం అనేపద్ధతి అములులో ఉండేది. ఎవరు ఎంతపెద్దతప్పుచేసినా, ప్రాయశ్చితం చేసుకుంటేచాలు, హిందూసంఘంలో వారు గౌరవస్థానం తిరిగి సంపాదించుకోవచ్చును. ప్రాయశ్చిత్తం అంటే బుర్రగొరిగించుకొని, నదులలో స్నానం చెయ్యడం, నాలుకపై చురకవేయించుకోవడం, పురోహితులకు సంతర్పణ చెయ్యడం, తాంబూలము, డబ్బూ, పురోహితులకు దానంచెయ్యడం, ఆవుపేడ, ఆవుపంచితాలతో, అంటరానివారుగా చూడబడేవారు ముట్టిన చెరువు నీటిని శుద్ధిచెయ్యడం వగైరా పద్ధతులే, ప్రాయశ్చిత్తంగా పరిగణింపబడేవి. కొత్తపద్ధతులు అవలంబిస్తుంటే, వారిపై సంఘ బహిష్కారం అనే మహా ఆయుధాన్ని ప్రయోగించి, భయపెట్టి, ప్రాయశ్చిత్తం చేయించి, సంఘంలో పునః ప్రవేశం చేయించడం, అప్పటివారికి నల్లేరుపై బండినడక లాంటిది. పదిమంది, ఒకచోటగుమిగూడి సాంఘిక విషయాలు చర్చించుకోవడం తప్పు. శంకరాచార్యులవంటి గురువులు, తరచు దేశాటనం చేస్తూ, ధర్మప్రచారం చేస్తున్నట్లు కనిపిస్తూ, ధనం ప్రోగు

చేసుకోవడం, సంఘంలో దురాచారాలపై ధ్వజ మెత్తిన వారిని, సంఘ బహిష్కృతులను చేయడం సోమరిపోతుబృందం పొట్టపోసుకోవడం, వారి వెంటవచ్చిన శిష్యబృందం, పరివారంలో ఇతర సభ్యులు కాని పనులుచేసినా, భరించి ఊరుకోవలసిన దౌర్భాగ్యం ప్రజలకు పట్టడం చాలా సామాన్యంగా ఆనాడు జరిగే విషయాలు.

రాజమహేంద్రవరం, అక్కడి పరిస్థితులు, మొదటినుండి శ్రీ వీరేశలింగం పంతులుగారు అవగాహన చేసుకొన్నారు. ఆయన బాల్యంనుండి, శారీరకంగా బలహీనుడైనా, అధ్యయనంలోనూ, రచనలు చేయడంలోనూ, సంఘంలో అనుసరించబడుతున్న పద్ధతులను, నిశితంగా పరిశీలనచేయడంలోనూ, చాలా ఉత్సాహం చూపిస్తూ, ఉండేవారు. బాల్యదశలోనే, ఆయన "వసుచరిత్ర" వంటి ప్రౌఢ ప్రబంధాన్ని పుస్తక విక్రేతలకు, కొంత రుసుముచెల్లించి, అధ్యయనం చేశారంటే, ఆయనకు పుస్తకపఠనంపై ఉన్న మమకారం, సంస్కృత భూయిష్ఠమైన గ్రంథాలను చదువుకోవడంలో, ఆయనకు గల భాషాపటిమ, మనకు ప్రస్ఫుటంగా కనుపిస్తాయి. చిన్నతనంలోనే, ఆయనకు నాయకత్వపులక్షణాలు ఉండేవి విద్యాలయంలో, ముఖ్య ఉపాధ్యాయుడు చదువుచెప్పడానికి అనర్హుడుగా ఉన్నాడని, ఆ ఉపాధ్యాయునిపై, మహజర్లుపెట్టి, విద్యాశాఖాధికారుల దృష్టికి తీసుకొనివచ్చి, బదిలీ చేయించారట. ఒకప్పుడు, తాము చదువుతున్న విద్యాలయంలో,ఎవరు మంచివిద్యార్థి అని ఓటింగు తీస్తే, అన్ని తరగతుల విద్యార్థులు, వీరేశలింగమేనని నిర్ణయించేశారు. దీనినిబట్టి వీరేశలింగంగారికి అధ్యయనశక్తి, నాయకత్వచిహ్నాలు, బాల్యదశనుండి ఉన్నవని గ్రహించవచ్చు.

వీరేశలింగంగారు, ఒకప్రక్క సంస్కృతాంధ్రాలు అధ్యయనం చేస్తూ, ఇంగ్లీషుబడిలో చదువుకోవడంచేత, ఆ భాషపై కూడా అధిపత్యం సంపాదించారు. ఆంగ్లభాషలోగల ప్రముఖమైన నాటకాలు, నవలలు, ఇతరవచనరచనలు, పద్యకావ్యాలు పూర్తిగా పఠించారు. బెంగాలీ రచయితల రచనలు, రాజారామమోహన్‌రాయ్‌వంటి, సంఘసంస్కర్తల జీవిత విశేషాలు, వారి రచనలు క్షుణ్ణంగా చదివారు. దేశంలో, స్థానం ఏర్పరచుకొన్న దురాచారాలను మూఢవిశ్వాసాలను నిర్మూలించి, ప్రజలను సన్మార్గంవైపు మళ్లించాలని గట్టిపట్టుదల పట్టారు.

శ్రీ వీరేశలింగంగారు కూడా, మొదట సనాతన పద్ధతులవైపు ఆకర్షింపబడ్డవారే. ఆయన భగవద్గీత్యర్థం, రెండు శతకాలు రచించారు. మొదటిది మార్కండేయశతకము, రెండవది గోపాలశతకము. అప్పటికి వీరేశలింగంగారు విగ్రహారాధకులే. ఉపవాసములు, వ్రతములు, స్తోత్రములు, భజనలు భగవంతునికి ప్రీతి కలిగించగలవనే ఆయన నమ్ముతూండేవారు గాయత్రీ జపము, ఆంజనేయ మంత్రము, రామమంత్రము పునశ్చరణచేస్తూ ఉండేవారు. కాని, కాలక్రమంగా ఆయన విశ్వాసాలలో మార్పు వచ్చింది. భూతవైద్యుల సహాయంతో దయ్యాలను చూడాలని ప్రయత్నించి, విఫలమనోరథుడు కావడం, ఎంతమంచి శకునం చూచుకొని ప్రయాణం సాగించినా, పనిజరుగకపోవడం, దుర్ముహూర్తంలో, బయలుదేరినప్పుడు కొన్ని సందర్భాలలో పని నిర్విఘ్నంగా సాగిపోవడం, ముహూర్తం బలంగా ఉన్నా, కొన్నిచోట్ల భార్యాభర్తలలో ఒకరు అకాలమృత్యువుకు ఆహుతికావడం మొదలైన దైనందిన సంఘటనలు, వీరేశలింగం గారిలో పెద్ద మార్పును తెచ్చాయి. ఏకేశ్వరోపాసన స్వీకరించి, ప్రజలను సన్మార్గంవైపు నడిపించి, మూఢ విశ్వాసాలను కూకటివేళ్లతో పెకలించివేయడానికి సిద్ధపడ్డారు.

కోరంగిపాఠశాలలో వీరేశలింగంగారు ఉపాధ్యాయవృత్తిలో చేరినప్పుడు, అమావాస్యనాడు బయలుదేరిపోయి, పనిలోచేరారు. పాఠశాల అధికారులు, అమావాస్యరోజున చేరడం ఎందుకని అభ్యంతరం తెలియజేసినప్పుడు, ఈశ్వరుడు చేసిన దినములన్నీ సమానమైనవే, మంచివేనని ఒకటి మంచిదినం, మరొకటి చెడ్డరోజు అని తలంచడం సరియైనది కాదని వారు ఎదురు చెప్పారు. కోరంగిలో వీరేశలింగంగారు ఉపాధ్యాయులుగా ఉండగా, మరోసంఘటన జరిగింది. ఒక భూతవైద్యుడు, ఆ గ్రామంలోకి వచ్చి భూత, ప్రేత, పిశాచాలను వెళ్లగొడతానని, ప్రగల్భాలను పలికాడట దానిపై వీరేశలింగంగారికి విశ్వాసం లేకపోవడంచేత, అదంతా బూటకమని ఎదిరించారట. భూతవైద్యుడు కోపగించి, ప్రతినచేసి, వీరేశలింగంగారిపై మంత్రప్రయోగం చేస్తానని, ఎదురింటిలో మకాంపెట్టి, అంజనం వెయ్యబూనాడట. వీరేశలింగంగారు లెఖ్ఖచెయ్యలేదు. దీనిపై ప్రమాదము నెదుర్కొంటున్నావని, ఇరుగుపొరుగువారు రాయబారాలు జరిపినా, వెనుకంజవెయ్యలేదు. భూతవైద్యుడుఉపవాసదీక్షచేసి,కొబ్బరికాయనీరుమాత్రం త్రాగి, పెద్దపెద్ద కేకలువేస్తూ, మంత్రజపం మొదలుపెట్టి తెల్లవారుఝామున, నీరసంవల్ల ఆ వైద్యుడు తూలిపడిపోయి, భయజ్వరం తెచ్చుకొన్నాడు. ఆ ఊరివారు, వైద్యుని కలుసుకొన్నప్పుడు "శరభసాళ్వ మంత్రమును" తనపై, వీరేశలింగంగారే, ప్రయోగించారని, కల్లబొల్లి కబుర్లు చెప్పాడట. వైద్యునికి జ్వరం తీవ్రతరంకాగా, సంధిలో, వీరేశలింగంగారి పేరు పలవరిస్తూ ఉండేవాడట. వీరేశలింగంగారు, దయదలచి వైద్యునికి ధైర్యంచెప్పి, మంత్రప్రయోగం ఏమీ చెయ్యలేదని, నమ్మకం కలిగించిన వెనుక, వైద్యునికి జ్వరం తగ్గిందట. ఈ విధంగా, మూఢవిశ్వాసాలను ఎదుర్కొనడంలో వీరేశలింగంగారిది విచిత్రమైనపద్ధతి, నిర్భయమైదృక్పథము.

ఆదినుండి, వీరేశలింగంగార్కి స్త్రీవిద్యావంతురాలు కానందువల్లనే,మూఢవిశ్వాసాలు, సంఘంలో చోటుచేసుకొన్నాయని, నమ్మి తూ వచ్చారు. "నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి" అన్న ఆర్యోక్తికి, ఆయన ప్రబల విరోధి. "ఆంధ్రభాషాసంజీవని" అనే పత్రికలో బ్రహ్మశ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు, స్త్రీవిద్యా నిషేధ వాదాన్ని ప్రచారంచేస్తూ, వ్యాసాలు వ్రాస్తూ ఉండేవారు. ఇది 1874 నాటిమాట స్త్రీ విద్యకు, అనుకూలంగా వీరేశలింగంగారు "పురుషార్థ ప్రదాయిని"లో వ్యాసాలు వ్రాస్తూ, వెంకటరత్నం పంతులుగారి వాదాన్ని ఖండిస్తూ ఉండేవారు.

సంఘ సంస్కరణకు, స్వతంత్ర జీవనము, స్వంత పత్రిక అవసరమని వీరేశలింగంగారి సిద్ధాంతం. స్వీయచరిత్రలో వారు చెప్పినమాటలివి:

"ఏ పనియు లేక స్వతంత్ర జీవనమునైన చేయవలెను, లేదా పాపకార్యములకంతగా, నవకాశము లేని యుపాధ్యాయత్వమునందైన ఉండవలెను, అని నేనప్పుడు నిశ్చయము చేసికొంటిని."

సంఘ సంస్కరణ ఉద్యమ నిర్వహణకు, పరిసరాలను దిద్దితీర్చుకోవడంలో, ఆయన పద్ధతి మనకు పైవాక్యంవల్ల విశదమౌతుంది. 1874 సంవత్సరంలోనే, "వివేకవర్ధని" అనే స్వతంత్రపత్రికను, వారు సంఘ సంస్కరణ ఉద్యమప్రచారానికి, ఆయుధంగాభావించి స్థాపించారు. పంతులుగారు, పత్రికా నిర్వహణోద్దేశాన్ని, తమ స్వీయచరిత్రలో ఈ క్రింది విధంగా పేర్కొన్నారు:

"ఈ పత్రికా ప్రకటనమునందు, నాయుద్దేశములు భాషాభివృద్ధియు, దేశాభివృద్ధియు, ముఖ్య

ముగా రెండు. వే నేర్పరచుకొన్న భాషాభివృద్ధి మార్గము తెలుగుభాషలో, మృదువైన సులభ శైలిని, సలక్షణమైన వచనరచన చేయుట. దేశాభి వృద్ధి మార్గము, జనులలో గల దురాచార దుర్వ ర్తనముల బాపియు, వృద్ధిపద్ధతులను జూపియు వాని నధిక నీతిమంతులుగా జేసి, దేశము నున్నత స్థితికి దెచ్చుటకయి, శక్తివంచనలేక పాటుపడుట, దేశాభివృద్ధికలుగుటకయి, విద్యావిషయమునను, వ్యవహార విషయమునను, కులాచార విషయము నను, నీతి విషయమునను, మత విషయమునను, నానాముఖముల గృషి చేయవలయుననియే కాని యొక్క రాజ్యాంగ విషయములందే, పనిచేయుట నా యుద్దేశము కాదు ... "

ఇంతటి ఉదాత్తమైన ధ్యేయం కొరకు, పత్రికా ప్రకటనము పంతులుగారు ప్రారంభించారు. ప్రభు త్వోద్యోగుల అవినీతి, ప్రవర్తనలు బట్టబయలు చేయడం వితంతు వివాహాలు ఎలా శాస్త్రసమ్మతమో నిరూపిస్తూ, స్త్రీలను అణగద్రొక్కడం, ఎంత నీచమైనపనో, ఆయన పత్రికాముఖంగా ప్రవచిస్తూ వచ్చారు. మూఢసిద్ధాంతాలపై, ఎన వాదనా పటిమతో, హేతుబద్ధమైన రచనలు చేస్తూ వచ్చారు 'సత్యరాజాపూర్వదేశయాత్రలు', 'రాజశేఖర చరిత్ర', ఎన్నో ప్రహసనాలు పత్రికా ముఖంగానే మొదట ప్రచురింపబడ్డాయి. పంతులు గారి వచనలశైలి, వారి హాస్యరసధోరణి, విమ ర్శనా చమత్కారం అనన్య సామాన్యమైనవి కావడంచేత, చదువరులను ఇట్టే ఆకట్టుకొనేవి. వారి రచనలు, ఉపన్యాసాలు, ఆంధ్రదేశంలో, పెద్ద దుమారాన్ని లేవనెత్తాయి. సనాతను లంతా ఏకమై పంతులుగారిపై ధ్వజమెత్తి అడుగడుగునా, ఆటంకాలు కలుగజేయడం మొదలుపెట్టారు.

వితంతువివాహ ఉద్యమం, వీరేశలింగంగారి జీవితంలో చాలా ముఖ్యమైన కార్యక్రమం. ఆనాటి దురాచారాలలో, భర్తపోయిన స్త్రీలను పనికట్టెలుగా మార్చి, బ్రతికినంతకాలం వివిధమైన సౌభాగ్యాలకు, సౌఖ్యాలకునోచుకోనివ్వనికట్టుబాటు పంతులుగారినిచాలాకలవరపరిచింది. ఈఉద్యమానికి, అంతర్భాగంగా, బాల్య వృద్ధ వివాహాల నిషేధం కూడా ముడిపడి ఉంది. ముందుగా, రాజారామ మోహనరాయ్‌గారు, సతీసహగమన పద్ధతిని రూపు మాపారు భర్తలుపోయిన వనితలు, తమ భర్తల కళేబరాలతో కట్టబడి చితికెక్కవలసిన దౌర్భాగ్యం అంతరించింది. కాని, వితంతువులైన వనితలకు, జీవన్మార్గంలేదు వారు పుట్టింటివద్దనో, అత్తింటి వద్దనో ఊడిగం చేసుకొంటూ, ఉప్పులేనిభోజనం చేస్తూ, ఉపవాసాలతో శరీరాన్ని కృశింపచేస్తూ, జీవితాంతం దుఃఖ సముద్రంలో ఈదులాడవలసిందే. వితంతువు అవినీతి కార్యక్రమాలకు పాల్పడినా, పెద్ద తప్పుకాదు కాని, పునర్వివాహం మాత్రం చాలా కూడనిపనిగా భావించేవారు. రామమో హనరాయ్ ఉద్యమం తర్వాత, పెద్ద సాంఘిక సమస్యగుంది దీనిని ఎదుర్కొని సరిదిద్దడాని , ఉద్భ వించిన మహాపురుడు మన వీరేశలింగ పంతులు గారు. బాల్యంలో ముక్కుపచ్చలారని బిడ్డలకు వివాహాలు చెయ్యడం, ఆ బాల్య దంపతులు పెరిగి పెద్ద వారుకాక పూర్వమే, ఏదో ఒక జాడ్యానికి గురియైన పురుషుడు మరణించిన పక్షంలో, అభము శుభము తెలియని ఆ అమాయకురాలు, సాంఘిక దురన్యాయానికి లోను కావడం, ఆనాటి నిబంధన ప్పురద్రూపులైన,బాల్యవితంతువులు, శిరోముండనం చేయించుకొని, వయస్సును సర్వసౌభాగ్యాలను ప్రక్కకుపెట్టి, జీవచ్ఛవాల్లా కాలక్షేపం చెయ్యడం చూచినప్పుడు, వీరేశలింగంగారి హృదయం అంటో భవ చెందింది. ఈ దురాచారాన్ని, ఎలాగైనా రూపుమాపాలని ఆయన దృఢంగా సంకల్పించు కొన్నారు.

వీరేశలింగంగారిని, మొదట స్త్రీ పునర్వివాహ విషయంలో, పురికొల్పింది చల్లపల్లి బాపయ్య పంతులుగారు. దానికి సహాయకులుగా నున్నవారు, న్యాపతి సుబ్బారావు పంతులుగారు, బసవరాజు గవర్రాజుగారు. ఆర్థికసహాయం పైడా రామకృష్ణయ్యగారు చేసినట్లు స్వీయచరిత్రలో పంతులుగారే పేర్కొన్నారు. స్త్రీ పునర్వివాహ ఉద్యమం, రాజమహేంద్రవరంలో పండిత సభతో ప్రారంభమైంది. 3-8-1879న, రాజమహేంద్రవరంలోని, విజయనగరమహారాజుగారి బాలికా పాఠశాలలో, వీరేశలింగంగారు సభ ఏర్పాటుజేసి పట్టణంలోని, పండితులకందరకూ ఆహ్వానాలు పంపించారు మనుస్మృతి, యాజ్ఞవల్క్యస్మృతి, పరాశరస్మృతి ముఖ్యంగా చదివి, వ్యాఖ్యానంలో స్త్రీ పునర్వివాహాన్ని సమర్థిస్తూ వీరేశలింగంగారు వ్యాసం తయారుజేసి, వితంతువివాహం శాస్త్రసమ్మతమే నని నిరూపిస్తూ సభలో చదివారు. దానిపై, సనాతనులంతా ఆక్షేపణ చేయడం, భయపెట్టడం జరిగాయి. వీరేశలింగంగారి పట్టుదల ఆక్షేపణలకు లొంగేదికాదు ఒకప్రక్క, "వివేకవర్ధని" లో వ్యాసరచన చేస్తూ, వివాహాలు స్వయంగా జరిపించాలని, దానికి అవసరమైన కార్యక్రమం చిత్తశుద్ధితో ఆయన ప్రారంభించారు.

వీరేశలింగంగారు చేసిన పునర్వివాహం అనేక వ్యయ, ప్రయాసలకోర్చి, ప్రమాదములను సహితం లెక్కచెయ్యకుండా, 11-12-1881 వ తేదీన రాజమహేంద్రవరంలో జరిగింది. అదిమొదటి స్త్రీపునర్వివాహము. కృష్ణామండలంలోని, రేపూడిగ్రామంలో ఉన్న, బాలవితంతువును, విశాఖపట్టణంలో ఉద్యోగం చేస్తూ ఉన్న గోగులపాటి శ్రీరాములు గారికిచ్చి జరిపించబడింది. వివాహముకాదలచిన చిన్నదానిని, రాజమహేంద్రవరం చేర్చినప్పటినుండి, సంక్షోభం ప్రారంభమయింది. ఆ కోలాహలం, వర్ణిస్తూ వీరేశలింగంగారు తమ స్వీయచరిత్రలో ఉదాహరించిన తీరు పరిశీలించండి:

"ఆ మరునాడే యీ వార్త యూరంతయు పొక్క, యా చిన్నదానిని చూచుటకయి, జనులు తీర్థప్రజలవలె మాయింటికి రాసాగిరి. అందుచేత, కొన్ని దినములు మాయిల్లు, తిరుమల వేంకటేశ్వరుని యాలయమువలె, వచ్చెడి వారితోను, పోయెడివారితోను సందడిగా నుండెను."

ఈ వివాహం దిగ్విజయంగా సాగడానికి, రక్షకశాఖ అధిపతులు, విద్యార్థులు, ఆర్థిక సహాయంతో పైడా రామకృష్ణయ్యగారు, తోడ్పడ్డారు. మొదటి స్త్రీ పునర్వివాహం ఎంతకష్టమైన వాతావరణంలో చేయవలసివచ్చిందో, వీరేశలింగంగారి ముఖతః వింటే మంచిది.

"పామరులవలని భయముచేత, మాయింట వంట చేయు బ్రాహ్మణ పనికత్తె, మమ్ము వరకే విడిచి పెట్టెను. పురోహితుడు, మాయింట శుభకార్యములు చేయించుటకయి రాక మానుకొనెను. బంధువులందరును, నన్ను బహువిధముల నిందించుచు, జాతిభ్రష్టునివలె చూడసాగిరి. వివాహదినమున, మాయింట మాత్రమేకాక మాయింటిచుట్టును, మా వీధి పొడుగునను రక్షకభటుల వలె, కావలసి వచ్చినది''

స్వీయచరిత్రలో, ఆ భాగం చదివినప్పుడు వీరేశలింగంగారు ఎంతకార్యదక్షులో నిర్భయులో, మనకు రూఢిగా తెలుస్తుంది. ఆయన, తాను నమ్మిన దానిని, ఆచరించడంలో దిట్టగాబట్టే, యుగపురుషుడు, సంఘ సంస్కర్త కాగలిగారు. తర్వాత, అనేక వితంతు వివాహాలు ఆయన చేతి మీద జరిగాయి. మద్రాసునగరంలో కూడా,

ఆయన స్త్రీ పునర్వివాహ కార్యక్రమం నిర్విఘ్నంగా, కొనసాగించారు. ప్రథమంలో, వితంతు వివాహాలు చేసుకొన్నవారికి సంఘ బహిష్కారం, ఎదురవడం చేత, కొన్ని సంవత్సరాలపాటు, కొద్దిపాటి నెల పరిశేతనాలు, నివాసానికి గృహవసతి, స్త్రీ పునర్వివాహ సంస్థవారు, ఇస్తూ వచ్చారు.

వీరేశలింగంగారు ఒక ప్రక్క వితంతు వివాహ కార్యక్రమం నెరవేరుస్తూ, ప్రభుత్వోద్యోగులలో లంచగొండితనం, అవినీతి తొలగించడానికి కూడా కృషి చేశారు. ఆనాడు, ఉద్యోగులలో లంచగొండితనం ఎంత ముమ్మరంగా ఉందో, వీరేశలింగంగారు కండ్లకు కట్టినట్లు చెప్పారు:

"ఆ కాలమందు, వేశ్యనుంచుకోనివాడరసికుడనియు, పౌరుషహీనుడనియు, భావింపబడినట్లే, లంచములు పుచ్చుకొనని వాడప్రయోజకుడనియు, బుద్ధిహీనుడనియు, పరిగణింపబడుచుండెను. అప్పుడు, లంచములు స్వీకరింపనొల్లని, ధర్మపరులయిన, రాజకీయోద్యోగులు సహస్రమునందు, గొందరుండుచు వచ్చిరిగాని, యట్టివారిసంఖ్య యత్యల్పమయి యుండెను లంచములు, గైకొనుటయుద్యోగధర్మమని, యెల్లవారును దలచియుండుటచేత, నిచ్చువారుగాని, పుచ్చుకొనువారుగాని దానిని తప్పుగా దలపకుండిరి. రహస్యమన్నది లేక, బంటుమొదలుకొని మంత్రివఱకు, రాజపురుషులందరును బహిరంగముగానే స్వీకరణము చేయుచుండిరి "

వీరేశలింగంగారు, లంచగొండితనాన్ని ఎదుర్కొన్న పద్ధతికి, నిదర్శనంగా ఒక్క ఉదాహరణ చాలు. 1878లో పోలూరు శ్రీరాములుగారు, రాజమహేంద్రవరం డిస్ట్రిక్టుమునసబుగా వచ్చారు. అప్పటికి, చిత్రపు కామరాజుగారు, ప్రభుత్వ న్యాయవాదిగా రాజమహేంద్రవరంలో ఉన్నారు. శ్రీరాములుగార్కి, కామరాజుగార్కి, బాంధవ్యం ఉండేది. కోర్టులో, వావనలపై కేసు ప్రగతిఆధార పడడం తగ్గిపోయింది. చట్టంలో, సంఖ్య ఉదహరించినట్లు, నటిస్తూ, తాము ఈయగలిగిన లంచం మొత్తం, రూపాయలలో కోర్టులో చెప్పడం, అది విని, శ్రీరాములుగారు న్యాయం నిర్ణయం చెయ్యడం. ఇలానడుస్తూ ఉండగా, వీరేశలింగంగార్కి ఈ అవినీతిపై కన్నుపడ్డది. న్యాయం, బహిరంగ వేలంలో, అమ్ముడుపోవడం, ఆయన సహించలేకపోయారు, వాకబుచెయ్యగా, పోలూరి శ్రీరాములుగారి తరపున, చిత్రపుకామరాజుగారు మొదట జడ్జిమెంటు ప్రతిని వ్రాయడం, అదిచూచి శ్రీరాములుగారు మేలు ప్రతిని, వారి స్వహస్తాలతో వ్రాసి, కోర్టులో చదవడం పరిపాటి అయింది కామరాజుగారి ఇంటివద్ద, చెత్తకుండీలో ఆయన వ్రాసిన జడ్జిమెంటు, మేలుప్రతి వ్రాసుకోవడం పూర్తయిన తర్వాత, చింపిన కాగితాలు పడుతున్నట్లు తెలిసింది. ఆ కాగితాలు ప్రోగుచేయించి, సరిగ్గా అమర్చి అతికించారు వీరేశలింగంగారు. శ్రీరాములు గారిపైన, కామరాజుగారిపైన, కోర్టులో అభియోగం తెచ్చారు కేసు, చాలా కాలం నడచిన తర్వాత, కేసు రుజువు అయింది అవమానం భరించలేక, చిత్రపు కామరాజుగారు, ఆత్మహత్య చేసుకొన్నారు పోలూరు శ్రీరాములుగార్కి మాత్రం మతి భ్రమించిందట

వీరేశలింగంగారు పట్టుబడితే, సమస్యకడతేరేవరకూ, విడిచే స్వభావంకాదు. వ్యయప్రయాసలకు వెనుదీయని పవృత్తి వారిది వారు వ్రాసిన, ప్రతి రచనలోనూ సంఘంలోని, దురాచారాలను, వ్యంగ్య ధోరణిలో విమర్శిస్తూ, ప్రజలకు జాగృతిని కలిగించారు. పత్రికాప్రచురణకూడా, వారందుకే చేపట్టారు వీరేశలింగంగారిపేరు రాగానే-స్త్రీ పునర్వివాహం మనకు గుర్తుకు వస్తుంది. కానీ ఆయన

చేసిన సాంఘిక సేవ, స్త్రీ పునర్వివాహాలకే పరిమిత మైంది కాదు. ఆయన కాలంలో, ఉన్న సాంఘిక దురాచారాలన్నిటిపైన ధ్వజమెత్తినవాడాయన. రచయితలలో మహారచయిత గాగలిగారు. నవల, స్వీయచరిత్ర, ప్రహసనాలు, వ్యాసరచన, మొద లైన క్రొత్త పోకడలు తెలుగు సాహిత్యంలో, ఆయన ప్రవేశపెట్టాడు. అందుకే, తెలుగువారు ఆయనను గద్యతిక్కన అని అప్యాయంగా, పిలుచు కుంటున్నారు. ఆయన గొప్ప విమర్శనాశక్తిగల పరిశోధకుడు. ఆంధ్రకవుల చరిత్ర చదివినపుడు మనకు ఆ విషయం ప్రస్ఫుటంగా కనుపిస్తుంది. వీరేశలింగంగారు, ఏ విలువలను సంఘంలో పునః స్థాపించడానికి పోరాటం సాగించారో, ఆ విలువలు ఇప్పటికీ లోపించేఉన్నాయి సాంఘిక కార్యకర్తలు సంఘ శ్రేయస్సును దృష్టిలో ఉంచుకొని, వీరేశ లింగంగారు చూపించిన మార్గాన్ని, పట్టుదలను ఒరవడిగా పెట్టుకొని కార్యక్రమ నిర్వాహణ చేయవలసివుంది. కులపిశాచం, హిందూసంఘాన్ని ఇంకా విడిచిపెట్టలేదు అన్ని రంగాల్లోనూ, కుల ప్రభావం వీరవిహారంచేస్తూ ఉంది. కులవ్యూహం నుండి బయటపడడానికి, ఎవరికీ శక్యం కాకుండా ఉంది. దీనికి పరిష్కారమార్గం వర్ణాంతర వివాహాలే నని, అందరూ ఒప్పుకుంటున్నారు కాని ఆచరణ లోనే, ప్రవర్తనడకలా సాగుతూంది. పూర్వులైన వీరేశలింగంగారివంటి, సంఘ సంస్కర్తల జీవిత విశేషాలు, చర్విత చర్వణంగా పారాయణ చేస్తే, తప్పక మనకు కావలసిన ధైర్యస్థైర్యాలు సమకూరి, కార్యక్రమం నిర్విఘ్నం కొనసాగుతుంది. 1 87 వ ప్రాంతంలోనే, కందుకూరి వీరేశలింగంగారి స్వీయ చరిత్ర, ఆంధ్రవిశ్వవిద్యాలయంవారు, బి ఎ. తర గతికి పఠనీయ గ్రంథంగా, నిర్ణయించినట్లు చిలక మర్తి లక్ష్మీనరసింహంగారు, స్వీయచరిత్ర ద్వితీయముద్రణ పీఠికలో, పేర్కొన్నారు. యువ కులు భావి పౌరులుకాబట్టి, యువకుల దృక్పథంలో మార్పు వస్తే, ముందు ముందు సంఘ సంస్కరణ సులభమౌతుంది. ఈ మధ్య వీరేశలింగంగారి స్వీయ చరిత్రను తలచినవారేలేరు. విశ్వవిద్యాలయాల వారు, దీనిని పాఠ్యగ్రంథంగా నిర్ణయించాలి. క్రింద తరగతులలో స్వీయచరిత్రనుండి, ఒక్కొక్క ప్రకరణాన్ని గ్రహించి, పాఠ్యపుస్తకాలలో చేర్చాలి. స్వీయచరిత్ర రెండు భాగాలు కలిసి 900 పేజీల వరకూ ఉంది కాబట్టి, అంతపెద్ద గ్రంథం విద్యార్థులకు, చదవడానికి కష్టతరంగా ఉంటుందని, తలంచినట్లయితే హితకారిణీ సమాజంవారు ప్రక టించిన సంగ్రహ స్వీయచరిత్రను పఠనీయ గ్రంథంగా గ్రహిస్తే సరిపోతుంది. రాష్ట్రంలోని మూడు విశ్వవిద్యాలయాలు వీరేశలింగంగారి స్వీయచరిత్రను, ఏదో పద్ధతిలో పఠనీయ గ్రంథంగా స్వీకరించవలసి ఉంటుంది.

వీరేశలింగంగారు, ఏ విలువలు సంపాదించ డానికి తమ జీవితపర్యంతం పోరాటం సాగించారో, ఆ విలువలను సంఘంలో ప్రతిష్ఠించడంద్వారానే, మనం వారిని గౌరవించగలుగుతాము. పంతులు గారికి అంతకుమించిన స్మృతిచిహ్నం, మరొకటి మనం నిర్మించలేము. ప్రస్తుతం, సంఘంలో అనేక దురాచారాలు చోటుచేసుకొన్నాయి. లంచగొండి తనం, కల్తీవ్యాపారం, దేవుడు పేరున జరిగే దురన్యాయాలు, అరికట్టాలంటే వీరేశలింగంగారి పట్టుదల, నిర్భీతి అలవరచుకొని చిత్తశుద్ధితో కార్యక్రమం నిర్వహించాలి

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వంవారు, పంతులుగారి సంఘసంస్కరణ కృషిని పునరుద్ధరించడానికి, ఈ సంవత్సరం నిర్దుష్టమైన కార్యక్రమం చేపట్టి నందుకు, మనమంతా వారిని మనస్ఫూర్తిగా అభి నందించవలసి ఉంది.

# వీరేశలింగకవి

## యస్. టి. జ్ఞానానందకవి

ముష్కరులైన పండిత సమూహాతమిస్ర వితండ భావమ
స్తిష్కము వ్రయ్యలై చనగ తీవ్రతర ప్రతిభాగభస్తి ధా
నుష్కుడవై నిలంబడిన నూత్న మహాంధ్రయుగ ప్రవక్త! నీ
నిష్కపట ప్రవర్తన వినీతి ధరిత్రికి జీవధాతువుల్.

పరిశామమ్మును దూరు ఛాందసులనున్ బాతాలు నేర్పంగను
ద్ధురతా బంధురతా వివేకమున జిందుల్ ద్రొక్కు ప్రాచీన శా
స్త్రరమన్ బూడిదపాలుసేయ నవతాధర్మమ్ముస్థాపింప సం
స్కరణన్ జేసిన వీరగద్యకవిలోక బ్రహ్మ! శ్రద్ధాంజలుల్.

మగడు గతించినంతనె యమాయకురాలగు జాయకూడనా
మగనివలెన్ జితింబడుచు మ్రగ్గుట తప్పనియాపువాని నీ
మనమున సంస్మరించి మతిమాలిన శాస్త్రవిధిన్ విదల్చి యా
మగువకు బెండ్లి పేరటపు మాన్యతగూర్చిన నీకు మ్రొక్కులా.

భాషా సరస్వతి స్వాతంత్ర్య మిసుమంత
కూడ బొందక గింజుకొన్న వేళ
కుహనామతస్థుల కుటిల కృత్యమదంపు
క్రూరసర్పము బుసల్ కొట్టు వేళ
వైధవ్యబాధచే వనటబొందిన స్త్రీల
యుసురులో నిప్పుకల్ విసరువేళ
పొగరువట్టినయట్టి మూఢవిశ్వాస పై
శాచికి దంష్ట్రిలన్ సాచువేళ

ఆంధ్ర సంస్కృతికి మహాపునర్జీవమ్ము
వోసినట్టి మాన్యబుధవతంస
కందుకూరి వంశ ఘనభూష ! వీరేశ
లింగ సుకవి నీకు చెంగనాలు.

అసదృశ ధైర్యసాహస సమంచిత ధీనిధి ! నీశరీరమున్
మెసవగజూచు నుబ్బసము నీచపు బెబ్బులితో నెదిర్చి దుర్
వ్యసనపరుల్ దిగుల్వడ సవాలును సేసి తెలుంగు శాసకున్
అసముగడించి పెట్టితివి యాంధ్రుల భాగ్యముగాక యేమగున్.

కుండాకోరులు కొంగబత్తిగల భక్తుల్ హింసన ప్రేరితో
ద్దండ స్వాంతులు సంఘవంచకులు చిత్తైనారు నీ ఘంటపున్
గాండీవమ్మున కొంటిమై యెదురుకొన్నావయ్య ! దిక్చక్రముల్
కొండాడన్నిను నీజయంతికివె నిగ్గుంజగ్గు పూజాంజలుల్.

నీడకు గూడులేక పడునిందకు నింతజవాబునీక న
ల్లాడు వితంతువుల్ మొగములందున హాసమరీచి తాండవం
బాడెను నీకృపాకలన నార్ద్రి హృదంతరమూర్తివైన నీ
కీడ సమానులెవ్వరు కవీంద్ర ! మహాంధ్రయుగప్రవర్తకా !

అవినీత్యుద్ధతి యీ సమాజమును నాహారింప సాహిత్య వి
ప్లవశంఖానినదమ్మునల్పి భవితవ్య శ్రేయమాశించి యీ
యవినీతిన్ వెడలింప దీక్షగొనినావయ్యా ! యశోమూర్తి ! నీ
యవతారమ్ము తెలుంగునేలకు ప్రపూజ్యజ్ఞాన పీయూషముల్.

*

# వీరపూజ

**పోచిరాజు శేషగిరిరావు**

నీల నీల నభోంగణమ్మున
తేలియాడుచు, చల్ల చల్లగ
నిలువుటెత్తు మనీషి తెల్గుల
నేలమీదకు చూచు నెవ్వడు ?
అతడు విప్లవ మారుతమ్మా !
తెలుగు నేర్పెడు పంతులయ్యా !
యుగము కెత్తిన దీపశిఖ యా
కందుకూరి విభుండు కాడొకో !
తాళపత్రపు టరణ్యములన్
రాచబాటలు వేసినాతడు
కవి కలమ్ముల కెన్నిటికొ, జీ
వనపు రేఖలు దిద్దె నాతడు
సర్వ వాఙ్మయ శాఖలందును
తానె శ్రీకారమ్ము చుట్టెను
మేని రక్తపు బొట్టుబొట్టును
జాతి సేవకు మీదు కట్టెను
'బ్రాహ్మ మత' విద్యుధ్వనమ్మున
'కోటి వాట్టుల బల్బు' కాడొకో !
కార్య శౌండిమ గండరించిన
జీవ శిల్పమొ ! ఈ మహాత్ముడు

గుండె గూటను దీపశిఖలను కూర్చి వెల్గ జేసె నెవ్వడు
నిండు గుండెలలోని పారలను నిల్పె సేవాభావమాతడు
కండ కలిగిన పలుకుబడితో గ్రంథ నిర్మాణమ్మొనర్చెను
గాంధి హరిజన సేవ కొఱకయి కాలు మోవక మున్నె, ఈయన
ఇరుకు సందుల - మురుగు కొంపల - హీనముగ జీవించువారికి
పరువునిల్పుటే ధ్యేయమయ్యెను పాపమూ తెలుగయ్యవారికి !

ధర్మ సంస్థల నిల్పి సర్వము ధారవోసెను వాటికొరకై ,
తాను నిల్పిన సంస్థలెన్నొ ఉదాత్తరీతిని వరలె నేటికి
తాను నమ్మిన సూత్రములకు సదా నిలంబడి ఒళ్లు విరిగిన
పులుల మీసలు పట్టి యూగెను పుంజుకొను శౌర్యమ్ముతో
పతుల బాల్యమునందు బాసిన పడతులకు పెండ్లిండ్లొనర్చెను

శోక తీరస్థులకు వారికి, సుఖ ప్రదమయి సాగె జీవిక
చెప్పునదియే చేసెనాతడు చేయలేనిది చెప్పనెఱుగడు
ముప్పువచ్చిన, మున్గిపోయిన పూనికను విడనాడలేడట !
లంచగొండుల రాత్రి చరులను రచ్చకీడ్చిన వీరయోధుడు

కోర్టుకెక్కిరి కొందఱయ్యలు గూఢ చరితము వీధిబడగా,
బురదగుంటల నీసడించెను, బూర్జువాలను త్రోసి రాజని
' వచన గంగా భగీరథుఁడై ' వరలె వాఙ్మయ జగతి లోపల
' గద్యతిక్కన ' తెలుగు శారద కంఠహారమ్మునై వెలింగెను
ఎన్ని చెప్పిన ' ఆంధ్రజాతికి ' ఈతఁ డొకఁ డే మహాపురుషుడు.



# ఆది మధ్యాంతములు

మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి

క్రవుల చరిత్రమ్ము పువుదూళి పొన్పున
నెఱఁ బొరలాడెడి పురిటిబిడ్డ
ప్రహసనమ్ముల పాలపసిఁడి బుగ్గలచేత
నిగ్గు నవ్వుల నించు నెత్రుకందు
తెల్గు రూపకముల వెల్గులో దోఁబూచు
లాటలాడెడి యొకనాఁటి నిసువు
వచనాభినవ విధారచన ప్రతోశకఁ
జొలవ గంతిడివ కిశోరమూర్తి
తెలుగు చదువుల తల్లి పొత్తిళ్ళమూట
నూట యిర్వది యైదేండ్ల నాఁటి శిశువు
నేఁటికి నందనోద్యాన వాటిలోన
నిజ మనోరథ ఫలము పండించుకొనియె.
ఆ చిన్ని కడుపున నధిగతోన్నత కళా
పాకాలయస్పృహాల్ పరిమళించు
ఆ కంటి కొనలలో నభినవ ప్రక్రియా
కలిత కృతి శతచ్ఛవులు తోఁచు
ఆ పసినవ్వులో నానందపుందోఁట
విరితీగ లిట మొగ్గ విచ్చుకొనును

ఆ జూనపాలలో నవతీక స్త్రీ శోక
ధారాశ్రువాః పయోదములు తోఁచు
తెలుఁగులకుఁ బంటగా భారతీయులకును
కంటి వెల్గుగఁ బున్నమ్మ కన్న కడుపు
పురికి రాజమహేంద్రికి ప్రొద్దుపొడుపు
శత శత జయంతులందు శాశ్వతపుఁగాన్పు
నర వెంద్రుకలను జుంజులుగొన్న కనుబొమ్మ
సందుల భావనా సుందరతలు
తెలిమీసముల చాటు మలుపు నవ్వులలోన
పొలుపైన క్రొంగ్రొత్తపువుఁ సొంపు
ముదివగ్గుగనపు నప్పొడివగ్గు నూర్పులఁ
బొదలారు గంఠఁ దుమ్మెదల రొదలు
గళమున రంగుచాఱల మఫ్లరున నొక్క
సరస వాసంత నిశాంత కాంతి
చెలువు దొలకాడ నవతరించెను సపాద
శత శరత్కాల పురుషాయుషమ్ముతోడ
ముసలి మధుమాస మల్లదే! మోడువడిన
తెలుఁగు బ్రతుకులు పల్లవించునఁటే! నేఁడు



# వీరేశలింగం

డా॥ అక్కిరాజు రమాపతిరావు

కొంతమందిది ఎప్పుడూ పోయేకాలమే
కొందరిది ఎప్పుడూ వచ్చేకాలం.
వీరేశలింగం పంతులుది వచ్చేకాలం.

ఆయన్ను ఎదిరించి పోట్లాడిన వాళ్ళందరిదీ పోతూపోతూ ఉన్నకాలం. పోయేకాలం.

అందువల్ల వాళ్ళ భావాల, ఆలోచనల, నమ్మకాల, సిద్ధాంతాల కాలం చెల్లిపోయింది.

వీరేశలింగం పంతులుగారు చెవినిల్లు కట్టుకొని బోధించిన భావాలకాలం, ఒకనాటి ప్రయోజనాలది మాత్రమేకాదు అవి కలకాలం నిలిచి వలసిన విలువైన ధర్మాలు మానవులంతా సుఖంగా బతకటానికి అనువైనమార్గాలను ఆయన చూపారు. తన జీవితకాలమంతా ఆ మార్గాలలో మనుషులను నడిపించటానికాయన పాటుపడ్డారు డెభ్భై ఒక్క సంవత్సరాల కాలంలో, యాభై సంవత్సరాల జీవిత కాలాన్ని నిర్విరామంగా గ్రంథరచనలో గడిపారు. శతాధిక గ్రంథాలను వ్రాశారు అయితే కేవలం, గ్రంథరచనతో, భావ విప్లవంతో ఆయన సంతృప్తి పడి ఊరుకోలేదు. 'పూని ఏదైనాను ఒక మేల్ కూర్చి జనులకు' చూపాడు. ఒక మేలుకాదు ఎన్నో మేళ్ళను తెలుగుదేశానికి కూర్చారు. ఒకవైపు నడుంకట్టుకొని, సంఘసంస్కరణ కార్యాచరణం. మరొకవైపు సాహిత్య ఆధునికీకరణం, తెలుగు దేశాన్ని తెలుగు సాహిత్యాన్ని, తెలుగు జాతిని, జాగృతం చేయడం ఆధునికయుగంలో తెలుగు దేశపు పునరుజ్జీవనం వీరేశలింగంగారి కృషితోనే ప్రారంభమైంది.

మహావీరుడు, కర్మయోగి, అచంచలుడు, ధర్మదీక్షాతపస్వి, నిరంతర కార్యవ్యగ్రుడు.

నూటపాతిక సంవత్సరాలక్రితం పంతులుగారు జన్మించేనాటికి సంఘంలోని పరిస్థితులన్నీ అస్తవ్యస్తంగా ఉండేవి ఇంటింటా దయ్యాలూ, భూతాలూ ఆవేశించి బాధిస్తూ ఉండేవి వేశ్యావృత్తిని నీచంగా పరిగణించక, సహజమైనదిగాను, సంఘంలో ఒక భాగంగానూ ఎంచేవాళ్ళు అధికారులు, సంపన్నులు, విధిగా వేశ్యాలోలురై ఉండేవాళ్ళు. వేశ్యాసంపర్కంలేకపోతే మగసిరికి లోపమనీ, హోదాకుతక్కువనీ, భావించే చెడ్డ రోజులవి. అగ్రవర్ణాలవారిలో సాధారణంగా బాల్యవివాహాలు, వృద్ధవివాహాలూ జరుగుతూ ఉండేవి. కడుపునపుట్టిన బిడ్డలని అయినా కరుణ లేక, దురాచారాలకు వశులై, క్రూరంగా నిర్బంధ వైధవ్యానికి ఆజీవమూ గురిచేసేవాళ్ళు సంతానాన్ని. అందువల్ల చాటుమాటుగా, అగతికలైనవితంతువులు అక్రమాలకు తలపడేవాళ్ళు. తెల్లబట్ట కట్టించి, కేశఖండనంచేసి, పశువులకన్నా కూడా

హీనస్థితిలో ఉంచేవారు వాళ్ళను. కాటికి కాళ్ళు చాచికొన్న ముసలి వగ్గులు, మళ్ళీ మళ్ళీ చేసుకో వచ్చు. బీదసంసారాలలోని కన్యలను అమాను షంగా డబ్బిచ్చి కొనుక్కోవచ్చు. శాస్త్రాలన్నిటికీ విపరీతమైన వ్యాఖ్యానాలు చెప్పి, స్వలాభపరులు, స్వార్థపరాయణులు, ధర్మకర్తలుగా చెలామణి అవుతున్న పాడురోజులవి. ఉద్యోగస్థులు లంచాలు తినడం, ఉద్యోగంలో భాగమే ననుకొనేవాళ్ళు. మానవత్వం ఎక్కడెక్కడో తలదాచుకోవలసివచ్చిన దుర్భరపరిస్థితులు సామాన్యజనంలో విద్యావికా సాదులు లేవు. సంస్కారంలేదు. చదువుకున్న వాళ్ళలో కూడా, బాధ్యతలేదు. పరిస్థితులను చేతనైనంతవరకైనా చక్కదిద్దాలన్న ఆర్తిలేదు.

సంఘంలో పరిస్థితులు వికృతంగా ఉన్నాయి వీటిని చక్కదిద్దాలి. ప్రజలందరికీ సంస్కారం కలి గించాలి. అని వీరేశలింగంపంతులుగారు ఆర్తి చెందారు. దీన్ని సాధించటానికి, సాహిత్యం గొప్ప సాధనంగా ఆయనకు తోచింది. జనసామాన్యానికి, అర్థమయ్యే విధంగా, రచనలు చేయాలి సంఘం లోని దురాచారాలన్నీ వాళ్ళు తెలుసుకొని తమ ప్రవర్తనలను సరిదిద్దుకోవాలి ముఖ్యంగా ఇల్లా ళ్ళకు విద్యావిజ్ఞానాలు కలిగితేగాని, సంఘం బాగుపడదు. తల్లిగా, ఇల్లాలుగా, ఉత్తమ సంస్కా రాన్ని సంఘంలో తీసుకొని రాగల సర్వశక్తిమంతు రాలు స్త్రీ. ఆమెను విద్యా, విజ్ఞానాలకు దూరం చేశారు ఇదివరలో అని ఆయనగారు స్త్రీ విద్య కోసం పోరాడారు. వాళ్ళకోసం ప్రత్యేకంగా పత్రికలు నడిపారు. కథలు వ్రాశారు. నవలలు రచించారు. ప్రహసనాలు ప్రకటించారు. సులభ శైలిలో తేటతెలుగు మాటలతో శాస్త్రీయ విజ్ఞా నాన్ని అందించారు. జనసామాన్యంలోని మూర్ఖ మైన అభిప్రాయాలను పోగొట్టవలెనని, వర్తమాన పరిస్థితులను కళ్ళకు కట్టినట్లు చూపించవలెనని, వ్యవహారధర్మబోధిని, బ్రాహ్మవివాహం వంటి ప్రహసనాలు ప్రకటించారు. ఆనాటి సంఘంలో వీరేశలింగం వ్రాసిన ప్రహసనాలు గొప్ప సంచల నాన్ని రేకెత్తించాయి. రాజశేఖరచరిత్ర, సత్య రాజాపూర్వదేశయాత్రలు, సత్యవతీ చరిత్రం వంటి నవలలు గొప్ప సాంఘిక చైతన్యాన్ని సృష్టించాయి. గొప్ప సాహిత్యవేత్త కాబట్టి, కాళిదాసు శాకుం తలం, రత్నావళి, మాళవిక నాటకాలు అనువ దించారు గొప్పపరిశోధకుడు కాబట్టి కవుల చరి త్రను, శాస్త్రీయ దృక్పథంతో విరచించారు. మహిళాలోక బాంధవుడు పంతులుగారు మహిళల దయనీయమైన పరిస్థితులను గూర్చి, వివరాలు సేక రించి పత్రికలలో ప్రకటించారు పన్నెండు సంవత్స రాల వయస్సులోపు వితంతువులు 63 వేలు, పది హేనేళ్ళలోపువాళ్ళు లక్షా 74 వేలు, షాలిక సంవత్స రాలలోపువాళ్ళు పన్నెండు లక్షల మంది ఉన్న హృదయ విదారకస్థితిని స్పష్టం చేశారు. 'కాసుకు లోనై సరీ తండ్రీ ముదుసలి మొగుడికి ముడివేస్తే' అని పూర్ణమ్మ జాలిగాథను గురజాడ అప్పారావు గారు వర్ణించిన ఘట్టాలు, సర్వసామాన్యమన్న మాట తెలుగు దేశంలో ఆనాడు.

నడుంకట్టుకొని ఎవరికీ జంకక, ముప్పైఫ మూడేళ్ళు నిండీ నిండని వయస్సులో స్త్రీ పునర్వి వాహాలు జరిపించాడు పంతులుగారు. ఒకవైపున అహర్నిశలూ సాహిత్యసేవ. మరొకవైపున సంఘ సంస్కరణకృషి. పతితయువతీ సంరక్షణ శాలలు, బాలికాపాఠశాలలు, ప్రార్థన మందిరాలు, నిర్మిం చడం, రాత్రిపాఠశాలలు నిర్వహించడం, మళ్ళీ న్యాయస్థానాలలో అభియోగాలు, ఒకక్షణం తీరిక లేదు. తన జీవిత సర్వస్వాన్నీ ఏ జాతికోసం త్యాగం చేశాడో వాళ్ళకే కృతజ్ఞత లేకపోయింది. చివరి

రోజుల్లో ఆయన అనేక కష్టనష్టాలకు గురి అయినారు. నిజంగా తమ స్వీయచరిత్రలో వర్ణించుకొన్నట్లు అది అసహాయదశ ఎంతరెంచరికో, తన ప్రాణాలను కూడా లక్ష్యపెట్టకుండా సహాయం చేసిన పంతులుగారికి జీవితంలో అసహాయదశ. ఈ జాతి ఎన్నటికైనా బాగుపడుతుందా? అసలు.

అరవై సంవత్సరాలు నిండిన వయస్సున కూడా త్రికరణశుద్ధిగా దేనినైతే నమ్మారో, దానిని ఆచరించిచూపటానికి వెనుకంజ వేయలేదు.

లోకవంచకుడను, ఆత్మవంచకుడను, భగవద్వంచకుడను కావటానికి ఇష్టంలేదు నాకుఅంటూ, అనుష్ఠానికి బ్రాహ్మమతాన్ని స్వీకరించారు. చిరకాలంగా తాము నమ్మిన సత్యమది. దాన్ని ఆచరణలో చూపాలి. ఇక మూడు నెలలకు చనిపోతారనగా. గిడుగు రామమూర్తి పంతులుగారి వ్యవహారిక భాషావాదం సబబైనదని ఆయనకు నమ్మకం కుదిరింది. వెంటనే వ్యవహారిక భాషను ప్రచారం చేయటానికి పుట్టిన వర్తమానాంధ్ర భాషా ప్రవర్తక సమాజానికి ఆయన అధ్యక్షుడై నాడు నవ్యాంధ్ర వ్యాకరణాన్ని నిర్మించటానికి పూనుకొన్నారు. కాని తెలుగుజాతి దురదృష్టం వల్ల అది అసంపూర్ణంగానే మిగిలిపోయింది.

ఆయన మహావీరుడు. ఆయన కలం, కత్తిలా, పనిచేసింది. బిడ్డను తల్లివలె, కంటికి రెప్పవలె, ఏభై సంవత్సరాలు, ప్రాణానికి ప్రాణమైనాకు సంరక్షణ చేసింది నాఇల్లాలు, అంటూ తమ స్వీయచరిత్రను ఆ చల్లనితల్లికే అంకితం చేశారు పంతులుగారు.

తెలుగు నాట ఆయన పేరు శాశ్వతంగా నిలిచిపోతుంది. తెలుగు దేశానికాయన చేసినసేవ ఎనలేనిది.



" నా జీవితంలో సాధించవల్సిన కార్యము లింకెన్నో ఉన్నవి. అవి సాధించబడక పూర్వమే అశువులు వీడవల్సి వస్తున్నది. అయినా నాఅనుచరులు, మిత్రులు, సంస్కారాభిలాషులు నాయీ మిగిలిన బాధ్యతను నిర్వర్తిస్తారని ఆశిస్తున్నాను. అజ్ఞానంలో, అమాయకత్వంలో జీవిత సంస్కారంలేని ప్రసాజామాన్యానికి విద్య, విజ్ఞానం, సమానత్వం, సంస్కారం, కలిగించడానికి కృషి చేయాలని కోరుతున్నాను."

—వీరేశలింగం అంత్యసందేశం

# ధీరమూర్తి

**గడియారం వేంకటశేషశాస్త్రి**

మ. అమలంబైన మనీష తా నసమాన్య ప్రౌఢి పాటించు శి
ల్పమునన్ పారగుడున్ మహేశ్వర పదాబ్జ ధ్యాన పూజా మహో
ద్యమముల్ వెల్గిన పండితుండు ఘన విద్యావంతుడు వీరేశలిం
గముగాం రాంధ్రజనైకతాగురుడు స్వర్గస్థుండు దీపించుతన్.

గములై పండితులెల్ల వహ్వారె యనంగా దేశభాషా ప్రబం
ధము లెల్లన్ వడబోసి తత్సమములాంధ్రంబుల్ సువిస్తార మి
శ్రమ గ్రంథ్యంబుల పెక్కు గూర్చిన మహాప్రాజ్ఞుండు వీరేశలిం
గముగా రాంధ్ర సరస్వతీ సుతుఁడు స్వర్గస్థుండు దీపించుతన్.

తానా బ్రహ్మమతంబువాఁడయిన విద్యాసంస్థలన్ నిర్మి ని
ధ్యానుండై తగు పాఠశాలలను జీతం బన్న వస్త్రాదులున్
నానారీతుల గూర్చి పెంచిన వదాన్య శ్రేష్ఠ వీరేశలిం
గానందుడు శుభోన్నతుల్ కలుగ సచ్ఛాశీస్సు లందించుతన్.

శాస్త్రంబుల్ బహుళంగులుండగ సమస్యాపూర్తి చేఁబట్టుచున్
నిస్త్రాసంబుగ భర్తృహీనయువతుల్ నిండౌ సుమాంగల్యలై
స్వస్త్రీతుల్యము గాజు, బొట్టు పసుపున్ భాసిల్లఁగాఁ జేసె శ
స్త్రాస్త్రంబుల్ కొనకుండ పంతు లది యచ్ఛాశీః ప్రభావంబగున్.

పురుషుల్ వోలె వడంతు లాత్మ విహితంబుల్ దీర్ప నొప్పించు బం
ధుర సంస్కారము నెంచి జీతము మొదల్ దూరంబుగా జేసి తా
నురవొం దన్ బహు పాఠశాలలు, అటు లుద్యోగా దులంగూర్చెనీ
తరుణీ కల్పకమైన పంతులు సుధాంధ శ్రేణి కీర్తింపగన్.

సమభావంబునఁ బొల్చు వ్యాసచయముల్ సంపాదకీయంబులున్
క్రమమొప్పంగ వివేకవర్ధని యనంగా పత్రికారాజ మాం
ధ్రమునందున్ నలుమూలలన్ బఱపి విఖ్యాల్గూర్చె వీరేశలిం
గముగా రాయన ధీర మూర్తికి నమస్కారంబు లర్పించెదన్.



# అందరిలో కందుకూరి

**జె. బాపురెడ్డి**

ఏడీ! కందుకూరి వీరేశలింగం
ఎక్కడా కనిపించడేం
ఆయన జయంతి ఉత్సవాలలో
ఆయనే అగుపించడేం

బహుశా ఆయనికి ఆహ్వానం
పంపలేదేమో
లేక ఆయన ప్రస్తుత అడ్రసు
ఎవరికీ తెలియదేమో

అయినా నమ్మను నే నమ్మను
ఆయన ఈ సభకు రాలేదంటే నే నమ్మను
వచ్చే ఉండాలి
'సంఘ సంస్కర్తల సంఘం' పక్షాన
ఏదో సందేశం తెచ్చే ఉండాలి —
అదుగో!
అక్కడెక్కడో కూర్చున్నట్టున్నాడు
అంతా గమనిస్తున్నట్టున్నాడు —
అధ్యక్షుల అనుమతితో ఆహ్వానిస్తున్నాను
రండి, వేదికమీదికి దయచేయండి
మా చిత్తశుద్ధిని శంకించకండి
మండలి వెంకట కృష్ణారావుగారున్నారు
మాలకొండయ్య గారున్నారు
పద్మశ్రీ బోయి భీమన్న గారున్నారు
ఇనుమర్తి వీరభద్రరావు గారున్నారు
ఇంకా ఎందరో సంఘ సంస్కరణాభిలాషులు
ఈ వేదికమీద ఉన్నారు, రండీ!
ఇదంతా మీకు విడ్డూరంగా ఉందికదూ
ఈ సభలూ, సమావేశాలూ, ఉత్సవాలూ
ఎందుకు చేస్తున్నారని అనుకుంటున్నారుకదూ
తెలుగుదేశంలో మీరు నాటిన వెలుగుతోటలు
నీరులేక, పెంపుచేసేవారు లేక
వెల వెల బోతున్నాయి
దురాచారాల, దుష్కృత్యాల
శిశిరఘాతాలకు
విలవిలలాడుతున్నాయి —
మనిషిలో దాగి ఉన్న
స్వార్థం, ద్వేషం, సంకుచితత్వం
మారువేషాలు వేయిస్తున్నాయే గాని
మారడంలేదు

ఎన్ని సంస్కరణలు చేసినా
ఈ జాతి జాతకం మారడంలేదు —
మట్టి దీపాలకు బదులు
విద్యుద్దీపాలు వెలిగించుకుంటున్నాం
కాని మనస్సుల్లోని చీకట్లను వెలిగించ లేక
పోతున్నాం
నల్లబజారుల్లో ధర్మదీపం నిలుపలేకపోతున్నాం
వెలుగులోకన్నా చీకట్లోనే మేము
వీరవిహారం చేస్తున్నాం

వెలుగుచూపితే పసుగులు ఎలుకలై
పోతున్నాయి
చీకట్లో ఎలుకలే పసుగులై పోతున్నాయి —
స్వేచ్ఛ కావాలన్నావు నీవు స్త్రీకి
ఇచ్చేశాం బోలెడంత స్వేచ్ఛ ఆమెకు
ఏమిటా స్వేచ్ఛ అంటారా ?
స్వేచ్ఛ లేదు అని చెప్పే స్వేచ్ఛ
స్వేచ్ఛ కావాలని స్వేచ్ఛగా అరచే స్వేచ్ఛ
ఇచ్చేశాం బోలెడంత స్వేచ్ఛ —
కులనిర్మూలనం చేయాలనాన్నావు నీవు
మాటను కొంచెంమార్చి
కులనిర్మాణం చేస్తున్నాం మేం
పునర్నిర్మాణం చేస్తున్నాం మేం —
బాల వితంతువులకు పెళ్ళిళ్లుచేయమన్నావు నీవు
చేసేశాం
అయితే, పెళ్ళిళ్ళే వద్దని కూర్చునన్న
"పెద్దబాలలు" తయారయారిప్పుడు
సంస్కర్తా ! వీళ్ళ సంగతేమిటి ?
కన్యాశుల్కం వద్దన్నావు
మానేశాం
వరశుల్కాలు వచ్చి కూర్చున్నాయి ఇప్పుడు
వీటినేం చేయమంటావు ? —
ఆడవాళ్ళను చదివించాలన్నావు నీవు
చదివించాం
వాళ్ళకు ఉద్యోగాలు రావటంలేదు సరికదా
పెళ్ళిళ్ళూ కావటంలేదు
ఇప్పుడు వీళ్ళనేం చేయమంటావు ? —
పరిష్కారాలు సమస్యలై పోతున్నవి
సంస్కరణలను స్వార్థాలు కొనేస్తున్నవి
అందుకే కందుకూరి
అందరిడెందాలలో ఉండిపొమ్మంటున్నాను
వచ్చినవాడవు రానేవచ్చావు
మళ్ళీ మమ్మల్ని విడిచి వెళ్ళద్దంటున్నాను
అధ్యక్షుల అనుమతితోనే అంటున్నాను
మీ అందరి ఆలోచనలకు అద్దం పడుతున్నాను.

(శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు 125 వ జయంతి ఉత్సవాల సందర్భంలో రాజమహేంద్రవరంలో 16-4-74 నాడు ఏర్పాటుచేసిన బ్రహ్మాండమైన కవి సమ్మేళనంలో చదివిన కవిత)



"పద్యమునుగాని వచనమునుగాని నేనొకసారియే వ్రాయుచుందును, వ్రాసిన దానిని మరల దిద్దివ్రాయుట నాకలవాటు లేదు."

— వీరేశలింగం స్వీయచరిత్ర

# ఆదర్శపురుషుడు

గొల్లపిన్ని రామచంద్రశాస్త్రి

సమయస్ఫూర్తి, దనర్చు ధీరుఁ డగుటన్ సాధించె నొక్కొక్క ఔ
త్యము, విద్యార్థులు తోడునీడలుగ కల్యాణంబు పండించె, నిం
ద్యము మాలిన్యము దుల్పె యేటి కెదురీదన్ గాగ వీరేశలిం
గము సంఘంబును సంస్కరించె నకలంకప్రజ్ఞ దీపారఁగన్.

బలహీనంబగు దేహమింతయు ధనప్రాలంబమే లేని దు
ర్బల సంసారము ; జీతమున్న నొకముప్పై రూప్యముల్ మించ వీ
యలఘూపాయములతో మహాప్రబల రాజ్యాసాధ్యముల్ కార్యముల్
వలపించెన్ తలపించె పంతులు మహాప్రత్యర్థి దుర్వారుఁడై.

తమ దేహంబును గేహమున్ ధనము విద్యాశ్రీ కాలమున్ గూడ దే
శము సంఘంబును కొల్లఁ దీనజనరక్షన్ చేయుగా నొడ్డె ; స
త్యము ధర్మంబును చూపి చెప్పె నిటు లత్యంతంబు వీరేశలిం
గము త్యాగంబొనరించె నాఘనుని విజ్ఞానం బసామాన్యమౌ.

అతి నిరంకుశవృత్తిని సతులనెల్ల
కడు నికృష్టపు పనిముట్లు గాగఁ జూచు
నీచతను బాపు పూనిక నెగ్గినట్టి
ఘనతరుండు వీరేశలింగము మనీషి.

విశ్వవిఖ్యాత సంస్కర్త, వినయశీలి
కవియు, ప్రాజ్ఞుండు, నియమితకార్యకర్త
తగు నిరాడంబరతమించి తనరు వాఁడు
పంతు లాదర్శపురుషుడు ప్రణుతి గొనుత.

# సంఘ సంస్కర్త

ఎం. ఎల్. నరసింహారావు

నవ్యాంధ్ర నిర్మాత, బహుముఖప్రజ్ఞాశాలి సంఘసంస్కర్త శ్రీ కందుకూరి వీరేశలింగంగారు తెలుగుజాతికి తెలుగుభాషకు చేసినసేవ అనన్యసామాన్యమైనది. ఆంధ్రజాతిలో ఒక నూతన చైతన్యాన్ని కలిగించి నిద్రాణమైఉన్న జాతిని మేల్కొలిపిన నవయుగ వైతాళికుడు ఆయన. ఆనాడు సంఘంలో కరుడు గట్టుకుపోయిఉన్న దురాచారాలను మూఢనమ్మకాలను నిర్మూలించడానికి ఆయన ఎంతో కృషిచేశాడు. రాజకీయ ఉద్యమంతోపాటు సంఘసంస్కరణోద్యమం కూడా అత్యంతావశ్యకమని భావించి, ఈ ఉద్యమానికి తాను పూర్తిగా అంకితమై నిర్విరామకృషి చేసిన మహనీయుడు ఆయన.

సత్యం, ధర్మం న్యాయం కోసం ఎంతటి త్యాగానికైనా వెనుదీయని దృఢసంకల్పం ఆయనకు బాల్యంలోనే అబ్బింది. ఎవరికైనా, ఎక్కడైనా అన్యాయం జరుగుతూ ఉంటే చూస్తూ ఊరుకొనే స్వభావంకాదు ఆయనది. ఎటువంటి కష్టాలకైనా ఎదుర్కొని, అన్యాయాన్ని ప్రతిఘటించి అంతమొందించేదాకా నిద్రపోయే వాడుకాదు. ఆయన బాల్యంలో విద్యార్థిగా ఉన్నప్పుడే ఇటువంటి ఒకచిన్న సంఘటన జరిగింది. ఆయన చదువుకొనే పాఠశాల ప్రధానోపాధ్యాయుడు ఇంగ్లీషు పాఠాలు సరిగా బోధించకపోవటంవల్ల, తనతోటి విద్యార్థులందరిచేత సంతకాలు పెట్టించి పై అధికార్లకు ఫిర్యాదుచేస్తూ మహజరు పంపించాడు వీరేశలింగంగారు. ఈ విషయం తెలిసిన ప్రధానోపాధ్యాయుడు విద్యార్థులను అనేక విధాల బాధలు పెట్టటానికి ప్రయత్నించాడు. కాని వీరేశలింగంగారు తన పట్టుదల వదలక విచారణ జరిగే వరకు నిద్రపోలేదు. విచారణ జరిగిన తరవాత ప్రధానోపాధ్యాయుణ్ణి అక్కడినుంచి బదిలీ చేయటం జరిగింది. ఈ సంఘటననుబట్టి వీరేశలింగం గారికి అన్యాయాలను ఎదిరించటంలో చిన్నతనంనుంచీ ఎటువంటిపట్టుదల ధైర్యము ఉండేవో తెలుస్తుంది.

విద్యార్థిగా ఉన్నప్పటినుంచే ఆయనకు మూఢ ఆచారాలు మూఢవిశ్వాసాలపట్ల విముఖత ఉండేది. దేశంలో చాలా మందికి దయ్యాలంటే నమ్మకం భయం. ముఖ్యంగా ఆ రోజుల్లో సమాజంలో ఇప్పుడున్నంత వికాసంలేదు. దయ్యాలకూ భూతాలకూ ప్రజలు భయపడేవారు. కాబట్టి భూతవైద్యులకు మంచి ప్రాపకంఉండేది. వీరేశలింగంగారు ఒకనాడు ఒక భూతవైద్యుణ్ణి కలుసుకొని తనకొక దయ్యాన్ని చూపమని కోరాడు. ఆ మాంత్రికుడితోపాటు తానూ శ్మశానానికి వెళ్ళి అక్కడ కూర్చున్నాడు. కాని ఆ భూతవైద్యుడుమాత్రం దయ్యాన్ని

చూపలేకపోయినాడు. ఈ భూతవైద్యులను విమర్శిస్తూ శ్రీ వీరేశలింగంగారు తమ స్వీయచరిత్రలో వ్రాసిన విషయాలుచూస్తే వారికి మూఢవిశ్వాసాల పట్ల ఎంత వ్యతిరేకత ఉండేదో తెలుస్తుంది.

ఉపాధ్యాయవృత్తిలో ప్రవేశించిన తరువాత శ్రీ వీరేశలింగంగారు సంఘ సంస్కరణోద్యమానికి నడుంకట్టి పూనుకున్నారు. ఆనాడు ప్రజలలో అక్షరాస్యుల సంఖ్య బహుస్వల్పం. మూఢఆచారాలు, మూఢ విశ్వాసాలు, అజ్ఞానం, సంఘంలో బాగా వ్యాపించి ఉండటం ఆయనకెంతో బాధ కలిగించింది. అధికార్లలో లంచగొండితనం, ఆశ్రిత పక్షపాతం నిరంకుశ ధోరణివంటి దోషాలను కూడా రూపుమాపటానికి ఆయన సంకల్పించుకొని 1874లో "వివేకవర్ధని" అనే మాసపత్రిక ప్రచురణ ప్రారంభించారు. ఈ పత్రికలో పంతులుగారు సంఘంలో పెద్దమనుష్యులని అనిపించుకొనేవారు చేసే దురాగతాలు, అక్రమాలు అన్యాయాలను ఘాటుగా విమర్శించటానికి పూనుకున్నారు "భాషాభివృద్ధి" "దేశాభివృద్ధి" ఈ రెండు తమ పత్రిక ప్రధాన ఆశయాలని చెప్పారు. సమాజంలో పేరుకొని పోయిఉన్న కుళ్లును ప్రక్షాళనం చేయటమే ఆశయంగా పెట్టుకొని ఈ పత్రికలో అనేక వ్యాసాలు ప్రచురించారు. లంచాలు పట్టే ఉద్యోగస్థులకు, వేశ్యాలోలత్వాన్ని ఘనంగా భావించే రసికులకు ఈ పత్రిక అంకుశమయింది. రాజమండి జిల్లా జడ్జి, గవర్నమెంటు ప్లీడరు, కోర్టు శిరస్తాదారు, మొదలైన కొందరు పెద్దలు కలిసి, లంచాలు పుచ్చుకొని కోర్టులో దాఖలయ్యే కేసుల్లో తీర్పులు చెప్పటాన్ని వీరేశలింగంగారు తమ పత్రికలో నిశితంగా విమర్శించారు ఈపెద్దమనుష్యులు వీరేశలింగంగారిపై కేసుపెట్టడం జరిగింది. తగిన సాక్ష్యాధారాలను చూపి వీరేశలింగంగారు వారి మోసాలను నిరూపించటంవల్ల వారికి కోర్టులో విజయం లభించింది. నిందితులకు శిక్షలు పడటం జరిగింది. శ్రీ వీరేశలింగంగారికి లభించిన ఈ విజయం సత్యానికి ధర్మానికి లభించిన విజయమే.

శ్రీ వీరేశలింగంగారు వివిధ పాఠశాలల్లో ఉపాధ్యాయుడిగా పనిచేశారు. ఎక్కడపనిచేసిన, విద్యార్థులకు నీతి, పెద్దలపట్ల గౌరవభావం, సచ్ఛీలం కలిగి ఉండాలనీ సాంఘిక దురాచారాలను రూపుమాపాలనీ బోధిస్తూ ఉండేవారు ఆనాడు. శ్రీ వీరేశలింగంగారు తలపెట్టిన అన్ని సంఘ సంస్కారోద్యమాలలోనూ విద్యార్థులు యువకులు ఆయనకెంతో తోడ్పడ్డారు.

1897 లో శ్రీ పంతులుగారు ఉద్యోగానికి శెలవుపెట్టి మద్రాసువెళ్ళటం జరిగింది. ఆ కాలంలో మద్రాసులో ఒక సంఘసంస్కార సభ స్థాపించి, ఒక వితంతు శరణాలయాన్ని నెలకొల్పటం జరిగింది. అక్కడ బ్రహ్మసమాజమందిరం కూడా కట్టించారు గ్రంథముద్రణకొక ప్రెస్సుకొని దానికొక ఇల్లు కూడా కొన్నారు. మద్రాసులో ఇటువంటి సాంఘికసేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్న రోజుల్లోనే వారిని మద్రాసు ప్రెసిడెన్సీ కళాశాలకు మార్చటం జరిగింది. 904 వరకూ అక్కడే ఉండి అనేక సంస్కరణ కార్యక్రమాలు చేపట్టి, దిగ్విజయంగా నడిపిస్తూ గొప్ప సంఘసంస్కర్త అనే పేరు తెచ్చుకొని అందరి గౌరవాభిమానాలకు పాత్రులైనారు. మద్రాసులో ఉండి వారుచేసిన కృషి, సంఘసంస్కరణోద్యమ ప్రభావం ఇతర రాష్ట్రాలకు కూడా విస్తరించి వారిపేరు ప్రఖ్యాతులు దేశమంతటా వ్యాపించాయి. స్త్రీ పునర్వివాహం, ఆడపిల్లలను పాఠశాలలకు పంపటం (స్త్రీ విద్య), అతి బాల్యవివాహాలను నిషేధించటం, సహపంక్తి భోజనాలుచేయటం వంటి సంస్కరణలు ప్రవేశపెట్టటానికి ఆయన ఎంతో కృషిచేయటం జరిగింది

1874 లో చందాలు ప్రోగుచేసి స్త్రీల పాఠశాల స్థాపించారు. వితంతు వివాహాలు ఎన్నో స్వయంగా చేయించారు. వితంతు శరణాలయాలను స్థాపించారు. హితకారిణీ సమాజాన్ని స్థాపించి దాని ద్వారా అనేక విద్యాలయాలు నెలకొల్పాడు. ఇక ఆనాటి సంఘదురాచారాలలో ప్రప్రథమంగా పంతులు గారు వ్యతిరేకించినది వేశ్యావృత్తిని. వివాహాది శుభకార్యాలలో భోగంమేళాల ఆచారాన్ని నిర్మూలించటానికి ఎంతో కృషి చేశారు.

స్త్రీలకు సంఘంలో ఉండవలసిన గౌరవస్థానం ప్రాశస్త్యాలను గురించి ఆయన చేసినకృషి అగ్రస్థానం వహిస్తుంది "మనదేశంలో స్త్రీల స్థితి బాగుపడిన గాని దేశము బాగుపడదని నా నమ్మకము" అని ఒక చోట వ్రాసినారు. "స్త్రీల హృదయముల జ్ఞానాంధకార బంధురములయి మౌఢ్య మహారాక్షస దుష్పరిపాలనమునకు లోబడియున్నంతవరకు నానావగుణ పిశాచములచ్చటనుండి తొలగిపోవు" అని పంతులు గారు చెప్పిన మాటవల్ల స్త్రీ విద్యపట్ల వారికిగల ఆసక్తి తేటతెల్లమవుతుంది

వీరేశలింగంగారు నెలకొల్పిన ప్రజాహిత సంస్థలు వాటికోసం నిర్మించిన భవనాలు ఎన్నో ఉన్నాయి. రాజమహేంద్రిలో 1890 లో పురమందిర నిర్మాణం, 1897 లో ప్రార్థన సమాజమందిరం కట్టించటం జరిగింది. హితకారిణీ సమాజానికి, రూ. 41,500 విలువగల ఆస్తి అప్పగించటం జరిగింది. హితకారిణీ ఆస్తికోన్నత పాఠశాల స్థాపించి స్వయంగా నడిపించారు. అందులో బాలికలకు హరిజనులకు అవకాశం కల్పించారు. వీరేశలింగంగారి సంఘసంస్కారోద్యమానికి అంతరాయం కలిగించటానికి కొందరు స్వార్థపరులు ఎన్నో ప్రయత్నాలు చేశారు. కాని అవి ఫలించలేదు. ఎందరు ఎన్ని ఆటంకాలు కలిగించినా భయపడకుండా తాము తలపెట్టిన ప్రజాహిత కార్యక్రమాలను దిగ్విజయంగా నిర్వహించి, తెలుగుజాతికి తెలుగు దేశానికి వెలుగుబాట చూపిన మహామనీషి శ్రీ కందుకూరి. అజ్ఞానంలో, అమాయకత్వంలో సంస్కారంలేని ప్రజాసామాన్యానికి, విద్య విజ్ఞానం, సంస్కారం, సమానత్వం కలిగించిటానికి ఆ మహనీయుడు చేసినకృషి, త్యాగాన్ని ఒక్కసారి మననంచేసుకొని ఆయన ప్రారంభించిన ఈ ఉద్యమాలను కార్యక్రమాలను ముందుకుతీసుకొనిపోయి నవసమాజ నిర్మాణానికి కృషి చేయవలసిన బాధ్యత మనలో ప్రతిఒక్కరిపైన ఎంతో ఉన్నది.



"సాహసము, స్వార్థత్యాగము, ఉత్సాహము, దీక్ష అను నాలుగు స్తంభముల పైనను ఆధారపడియున్న వారి నిశ్చల క్రియాదీక్ష ఆంధ్రయువకులకు ప్రార్థనామందిరమై, నిత్య నూతన పవిత్ర శక్తులను ప్రసాదించుగాక"

—శ్రీ నండూరి బంగారయ్య

# వెలుగుదారి కందుకూరి

**దాశరథి**

కందుకూరి అందరికిష్టం
కందకూర కొందరికిష్టం
కందుకూరి మెదడుకు మేత
కందకూర కడుపుకు మేత
కందుకూరి వ్రాసినవ్రాత
అందరికీ భగవద్గీత

అతడు ఆంధ్రజాతికి నేత
మరపురాని దాతని చేత
నాటికన్న ఈనాడే
కందుకూరి కావాలి
అతనిబోధనలు అర్థంచేసుకు
ఆంధ్రజనావళి నడవాలి

మూఢత్వం పోలేదే!
మూర్ఖత్వం విడలేదే!
సంకుచితపు పంకంనుండి
జనం బయట పడలేదే!

అందుకనే కందుకూరి
అవసరమెంతో వుంది

కందుకూరి రచన చదివి
పొందాలి నవస్ఫూర్తి
ఉదయించే సూర్యునిలో
ఉన్నది అతని కీర్తి
ఉరకే గోదావరిలో
ఉన్నది అతని ఆర్తి

కందుకూరి పున్నాడు
అంతటనాడూ, నేడూ;
నీలోపల, నాలోపల
నిఖిలాంధ్రావని లోపల
పట్నంలో, గ్రామంలో
సాంఘిక పరిణామంలో

యువకులలో యువతులలో
మేధావుల మనసులలో
కలాలలో గళాలలో
రైతన్నల హలాలలో
సాంద్రతమమ్ముగను చెండే
చంద్రుని కిరణాలలో

కందుకూరి వున్నాడు
కలకాలం వుంటాడు
ఆయన ఆదేశాలను
అనుక్షణం పాటింతాం
అతని సదోబధలను
అవనిలోన చాటింతాం
అతని ఆశ తీర్చెదమని
అందరముద్ఘాటింతాం
సౌమనస్య, సౌభ్రాత్ర
సౌజన్య గుణాలతో
జాతి విరాజిల్లుటకై
తిరోగామి శక్తులతో
బరాబరిగ పోరాడి
పురోగమనమును నేర్పిన
పురుషోత్తముండాతడు
కందుకూరి చూపినదారి
ఆంధ్రులందరికి వెలుగులదారి



"తెలుగు భాషను వృద్ధిచేయవలెనన్న యభిలాషము నాకు మొదటి నుండియు విశేషముగా నుండెను. నేను నా కాలమునంతను భాషాభివృద్ధి నిమిత్తమే యుపయోగించి పాటుపడియుండిన పక్షమున గొంతవఱకు నా యభిలాషము నెరవేరియుండు నేమో."

—స్వీయచరిత్ర

# నేడొక కందుకూరి కావాలి

## ఎస్. వి. పి. వి. కె. సత్యనారాయణరావు

"కలమా - ఖడ్గమా - ఏది బలము ?" అనే విషయాన్ని మా హైస్కూలు రోజుల్లో విద్యార్థి సారస్వత సమావేశాలకు చర్చలకు తరుచుగా ఎన్నుకుంటూ ఉండేవాళ్ళము. కలమే కత్తికంటే పదునైనదీ, సైన్యముకంటే బలమైనదీ అని నిరూపించడానికి కందుకూరి వీరేశలింగం గారిని సగర్వంగా ఉదాహరించేవాళ్ళము. నిజంగా వీరేశలింగంగారి ఆరోగ్యము సరియైనదికాదు. ఆస్తమాతో బాధ పడుతూ ఉండేవారు ఆ బాధతో నిద్రరాని రోజులెన్నో గడిపేవారు. ఆ సమయాలే, ఆయా నడిరాత్రి ఘడియలే తన కలానికి పదును పెట్టే వేళలేమో.

గోదావరి నదీమతల్లి ప్రభావ మెటువంటిదో గాని, ఆ నదీ తీరాన, ముఖ్యంగా సరస్వతీ నిలయమయిన రాజమహేంద్రవరాన ఎందరు మహానుభావులు, మేధావులు జన్మించి తెలుగుతల్లి బిడ్డలకు ఎనలేని సేవచేసియున్నారో చెప్పలేము. ఆ రాజమహేంద్రవరములోనే 1848 సంవత్సరంలో మన కందుకూరి వీరేశలింగం జన్మించారు.

ఎప్పుడయినా ఎక్కడయినా ఒక వ్యక్తి ప్రసిద్ధుడయాడంటే అతనికి గల పూర్వజన్మ సంస్కారము, చిన్నవాటనుండి తన మనోభావాలపై బలమైన ముద్రలు వేస్తూవచ్చిన సంఘము, అతని లేత భావాలకు ఒక రూపకల్పనచేసి జవశక్తుల నాపాదించిన ఇతరవ్యక్తులు, శక్తులు మొదలగునవి గమనించదగ్గవి.



ఇతని తండ్రి చిన్ననాటనే చనిపోగా, పెద్దతండ్రి వెంకటరత్నము పెంచి పెద్దచేసెను. విద్యాభ్యాస ప్రారంభము సంస్కృతాంధ్ర భాషలతో పంచకావ్యాల పఠన మయినది. ఇక ఆంగ్ల భాషాధ్యయనము చేసుకొనెను. ఆరోజులలో సంస్కృతాంధ్ర భాషలతోపాటు ఆంగ్ల భాషకూడ వచ్చిన పండితులు కొద్దిమంది కనుక ఈ విశేష భాషాపరిచయము వలన వీరేశలింగం పంతులు తన రచనలలో సమగ్ర స్వరూపము, పరిశీలనాశక్తి, వాటి నడుమ సమన్వయాసక్తి, ఇవి చాలక కొత్త సాహిత్య రూపాల సృష్టి నిరూపించగలిగాడు.

వీరేశలింగం పంతులు వ్రాసిన కవుల చరిత్రకు ఆంధ్రసాహిత్యములో ఒక ప్రత్యేక స్థానమున్నది. కవుల చరిత్ర వ్రాయుట చాల కష్టము. కవులు జీవించియుండిన కాలములు తెలియవు. వారి రచనలలో ఆధారములు కనబడవు - కవులు వ్రాసిన గ్రంథాలు ఒక్కచోట ఎక్కడాలేవు - అచ్చుకాలేదు-ఉన్న తాళపత్రగ్రంథాలు మద్రాసు, తంజావూరు నగరాలలోని ప్రసిద్ధ గ్రంథాలయాలలోనే కనబడేవి. అక్కడకు వెళ్ళి, కొన్ని నెల

అయినా ఉండి, కావలసిన విషయాన్ని సేకరించ వలసివచ్చేది. దానికయ్యే శ్రమ, ఖర్చు, కొన్ని సమయాలలో నిష్ఫలమై, వర్ణనాతీతము. కవుల కాలనిర్ణయములో ఇతడు పడినశ్రమ చెప్పలేము. పుస్తకాధారాలు ఎక్కువగా ఉన్న ఈ రోజులలో అతనానాడు నిర్ణయించిన కవికాలములు కొన్ని సందర్భాలలో సవరణచేయవలసి వచ్చినా, తనకు గల స్వల్ప ఆధారాలతో, నిర్మించిన సాహితీ సౌధము మాత్రము అచలమయినది.

చిన్ననాటినుండి వీరేశలింగం మహాభక్తిప రుడు. భక్తి సాధకునికి సామాన్యముగా అయిదు సద్భావాలుంటాయి - శాంతభావము, దాస్య భావము, సఖ్య భావము, వాత్సల్య భావము, మాధుర్య భావము. వీటిలో ఏదో ఒకటిగాని, కొన్ని గాని, ఒక్కొక్కని భక్తి తాత్పర్యములో అతని స్థాయీ భేదాన్ని బట్టి రాణగువస్తూఉంటాయి. వీరిలోగల వాత్సల్యభావము అపారమైనది. తనకు సంతతి లేకపోయినా, తను స్థాపించిన సంస్థలోని అనాథలందరూ కందుకూరి దంపతులకు వత్సలులే. ఇతని సతీమణి రాజ్యలక్ష్మి, తనపట్ల విశేషభక్తిశ్రద్ధ లతో మండి, సంఘ దురాచార నిర్మూలనాది కార్యక్రమాలలో సంపూర్ణ సహకారియైయున్నం దున, వీరి మధ్య నొక విశిష్టమాధుర్య భావము ప్రస్ఫుటమయేది.

తను జీవించిన 70 సంవత్సరాలలో (1848-1919) తొలి యౌవనమంతా 20 సం॥ల వయసు వరకు పూర్వాచారాల మధ్య నొక ఛాందస జీవ నంగా గడచిపోయినది. అంతవరకు నిద్రాణమై యున్న వీరేశలింగ యుగపురుషుడు కనువిప్పినా డేమో! తన యింటి చుట్టూ ప్రతి నిమిషము కనబడి బాధించే సంఘ దురాచారాలు, ఇటువంటివే ఇతర రాష్ట్రాలలో నున్నపుడు వాటిని సంస్కరిం చిన మహాపురుషుల ప్రవచనాలూ, ఇతనిని మేల్కొ లిపినాయి.

ఆడపిల్లలకు చిన్నతనముననే, డబ్బుకాశించి వయసుమళ్ళినవారితో వివాహము. దానితో సొంత కాపురపు సొగసు ననుభవించక పూర్వమే, తన సొగసుకి స్వస్తిచెప్పి, మేలిముసుగుల చిరునగవు లకు బదులు బోడి ముసుగుల పాపిష్టిముఖముదాల్చి, చాకిరితో, సంఘములో అపశకున సామ్రాజ్ఞిగా గుర్తింపబడి, చావలేక చస్తూ ఉన్న వందలాది వితంతువులు తన హృదయాన్ని కరగించి కద ల్చారు. గోతిలోపడిన గొడ్డుపై తల నొక బెడ్డ వేయునట్లు, ఈ బాల విధవలకు దయ్యము పట్టిం దని చెప్పి దయ్యాలను బోగొట్టే భూతవైద్యులను పిలిపించి జరిపే అట్టహాసాలు భూతవైద్యులు కొట్టే దెబ్బలు, పెట్టే బాధలు, కళ్ళలో న్వూదే ధూపము- ఒకటేమిటి అదొక విచిత్రవధశాల. ఏ పాప మెరు గని బాల వితంతువుల బాధను చూచి సహించలేక పోయాడు. కన్యాశుల్కము, అతి బాల్య వివా హము, బాల వితంతువులు - ఈ మూడు కూడిన విషవలయాన్ని ఛేదించడానికి కంకణముకట్టుకొని రంగంలో ప్రవేశించాడు.

ఈ ప్రధానమైన సాంఘిక దురాచారముపై దాడిచేస్తూ ఉన్నవేళలో అడుగడుగునా అవినీతి, లంచగొండితనము, సంఘములో కన్పడుతునే ఉండేది. రంగములో ప్రవేశించిన తర్వాత ఏ ప్రతిప క్తివచ్చినా, ముందడుగువేసి సాధించేవరకు నిద్ర పోవుట నెరుగడు.

ఈ మహా పోరాటములో తనకున్న బలమంతా ప్రధానమైన కలం బలం, ఎవరి శ్రేయస్సు కొరకు తాను పోరాడుచున్నాడో ఆయా అనాథల సాను భూతి; తను క్రమంగా సాధించిన విజయపరంపర

లకు క్రమంగా లొంగి, ప్రేమించి, తన పక్షము చేరిన మిత్ర వర్గము.

ఒక ఉద్యమములో సాహిత్యాన్ని మరల్చి, కొత్త కొత్త రూపాలను ప్రవేశపెట్టి, ప్రచారము లోనికి తెచ్చి, తన సాహిత్యబలాన్నే ప్రబల సాధన ముగా చేసుకొని విజయముపొందిన వ్యక్తి వీరేశ లింగం. పద్యరచన వదలి గద్యము, నాటకాలు, ప్రహసనాలు, ఉపన్యాసాలు మొదలగువాటిని ప్రజాను రంజకముగా తన లక్ష్యసాధనకు అనుకూ లంగా చేసి వ్రాసిన మహనీయుడితడు న్యాయ స్థానాలలో జరిగే అన్యాయాలను విమర్శిస్తూ వ్రాసిన ప్లీడరు నాటకమనే వ్యవహారధర్మబోధిని, పెద్దయ్య గారి పెళ్ళిపుస్తకం అనే బ్రహ్మవివాహం, పిచ్చవ తిర్యక్ విద్వన్ మహాసభవంటి ప్రహసనాలు, వ్యంగ్య ధోరణిలో నడచి, ఆనాటి సమాజములోని దుష్టశక్తులను వ్యక్తులను చీల్చి చెండాడు ప్రతిభ గలవై ప్రచారములోనికి వచ్చాయి.

మతము పేరిట భిన్న భిన్నవర్గాల మధ్య జరిగే పోరాటాలను చూచి సహించలేక, అసలు బ్రహ్మము, ధ్యానము వంటి ఉత్కృష్టపదాల భావము తెలి యక కీచులాడే వ్యక్తులను, మతస్థులను ధిక్కరించి చివరకు బ్రహ్మసమాజము స్వీకరించాడు.

సంఘసేవ, బలహీనవర్గాల సముద్ధరణ వంటి కార్యక్రమాలలో సంస్కారము, వ్యక్తిత్వము లేని వారు చేరి, ఒకవంక సంఘ శ్రేయస్సుకొరకు పాటుపడుచున్నామని ప్రగల్భాలు చెప్పుకొనుచూ దొంగచాటుగ ఆ కార్యక్రమ నిధులనుండే ఎక్కువ మొత్తాలను తమ కైవశము చేసుకొని ఘన మానవులవలె చెలామణి అయ్యే వారి మాదిరికాక, తన సర్వస్వము యావదాస్తిని విధవా వివాహాది సంఘ సంస్కరణోద్యమానికి ధారబోసి తన అనంత రము కూడ తన ఉద్యమము సాగునట్లు పాఠశాల వసతిగృహములు ఏర్పాటు స్థాపించిన మహామనీషి కందు కూరి వీరేశలింగం.

అతిబాల్యవివాహాలు కాకపోయినా, ఇంకొకవిధ మైన అవినీతితో కూడిన యీనాటి సాంఘిక దురాచా రాలను నిర్మూలించడానికి కంకణముకట్టుకొని సత్యా గ్రహదీక్షతో శాంతి సమరం చేస్తూ సాహిత్యాన్ని సాధనముగా చేసి పోరాడగల ఇంకొక వీరేశలింగం ఈనాడెంతైనా అవసరము.

*

"ఎక్కడ [illegible] స్వార్థము. కాదు. ఆ యుద్యమములు [illegible] మనస్సునకు అంటకుండగదు".

—స్వీయచరిత్రము

# వీరేశలింగం

**ఎల్. మాలకొండయ్య**

కలుపుకమ్మిన చేనులాగ
అర్థంలేని ఆచారాలతో
ఆధారంలేని నమ్మకాలతో
స్వార్థపరులతో
సంఘ వినాశకులతో
దురాచారాల దుర్బుద్ధులతో
కలుషితమైన ఆనాటిసంఘం !

అంతాగద్దలు రాబందులే
ఆరాచిలుక చుట్టూ —
అన్నితోడేళ్లు, బెబ్బులులే
ఆ కుందేలుచుట్టూ —
ఎంతధైర్యం ఆ పాలపిట్టకు !
ఎగిరి తన్నింది గద్దనే గద్దించి !

మూఢనమ్మకాలపై చేశాడు దాడి
బాల విధవలకు పెట్టాడు నొసట బొట్టు
తుంచాడు కులమత భేదాలను కూకటివేళ్ళతో
ఎదుర్కొన్నాడు అన్ని దురాచారాలను.

వృద్ధపురుషులు వ్యభిచరించవచ్చు
బాలవితంతువులకు మళ్ళీకారాదు పెళ్ళి
అనే మూర్ఖులను వద్దించాడు ఎడా, పెడా
నేర్పాడు బుద్ధి —

ఈ సంఘ సంస్కరణ సమరంలో
మూఢనమ్మకాలపై దాడిలో
వాడాడు వాడిగల ఆయుధాలు
చూపాడు కత్తికంటే కలమే కరుకు అని

డాలు కంటే పుస్తకమే మేలు-అని
మందుగుండుకంటే మనసేగొప్ప అని
మాపాడు మాయని మచ్చలను
నిల్పాడు నిండు పూర్పులను.

మార్చాడు మనిషిని మనిషిగా
తెలుగుజనకోటి హృదయ పేటికలో
నిలిచాడు వందనీయుడుగా వీరేశలింగం.



# సంస్మరణము

కె. శేషయ్యశాస్త్రి

బాలిక బడికేగ బ్రతుకె పోయిన యట్లు
        కులము పెద్దలు చాల కుములు నాఁడు
ముక్కు పచ్చారని ముద్దుపాపల శత
        వృద్ధులకును ముడిపెట్టు నాఁడు
కాపురానికి కన్నె కదలక ముందటే
        మగఁడు కాటికి చేరి మండునాఁడు
మొగ్గ తొడ్గిన కోర్కె బుగ్గిపాలై నంత
        అనదలై మగువ లల్లాడునాఁడు

యావదబలా జనాభ్యుదయమ్ము కలుగఁ
జేయ నీశ్వరుఁ డంపిన చిన్మయాంశ
మనఁగ శ్రీ కందుకూర్యన్వయంబునందు
అవతరించె వీరేశలింగాహ్వయుండు.

వ్యంగ్యప్రధానమౌ ప్రహసనాలొకవంక
        ఉద్భట వాదంబు లొక్కవంక
ప్రాచీన కావ్యాళి ప్రకటించు టొకవంక
        చక్కని యనువాద మొక్కవంక
మూఢవిశ్వాస నిర్మూలనం బొకవంక
        ఉత్తమ సంస్కార మొక్క వంక
పరి పంథి వర్గంబు భంజించు టొకవంక
        ఉన్నతాదర్శంబు లొక్కవంక

ఎటుల సాధించినావు నీ విన్ని పనులు
దేశ సౌభాగ్యమందెంత దీక్ష నీకు
ఏమిచేసిన మాకు నీ ఋణము తీరు
నెట్లు నుతియింతు నిన్ను వీరేశలింగ !

దివ్యగాయత్రి నత్యంత దీక్షతోడ
శతసహస్రాలు జపియించు ఛాందసుడవు
అసలు జంధెంబునే వీడి తబ్బిరముగ
బ్రాహ్మమతమున నీకెంత భక్తి కలిగె ?

ఆంధ్రభారతి క్రొంగ్రొత్త యందములను
సంతరించినదోయి నీ చలువ వలన
సంఘ సంస్కార యత్న ప్రశస్తి వలన
జాతి నిన్నెప్డు భక్తితో సంస్మరించు.



**ఈ మానవ** మహాసాగర మధ్యాన నవయుగారంభ వేళ నిలబడిన నవమానవుడు, **తొలి యూనివర్సల్** మాన్ తెలుగు నాట వీరేశలింగం.

—దేవులపల్లి వేంకటకృష్ణశాస్త్రి

# తెలుగు జాతిపిత

బోయి భీమన్న

వీరేశలింగం మహాశయా!
వీరేశలింగం ఆగినచోటినుంచి
లింగం మాలకొండయ్యా ముందుకు సాగాడని
ప్రజలు చెప్పుకోవడం విని —

ఆంధ్రప్రదేశ్‌ను నిజంగానే
తెలుగుదేశంగా తీర్చిదిద్దుతానంటూన్న
వెంగళరావు ప్రాభవం గుర్తించి —

కృష్ణుడికి అర్జునుడులా
అగ్నికి వాయువులా
ముఖ్యమంత్రి ఒరలో ఖడ్గంలా
చెడ్డనుతుంచే, మంచిని పెంచే
కార్యనిర్వహణలో మిన్న అయి
ఈ తెలుగు మండలికే కృష్ణ వెంకన్న అయిన
మండలి వెంకట కృష్ణరావును
చూడాలన్న కుతూహలం కలిగి —

మహా ప్రాభవ దీప్తంగా, దేశవ్యాప్తంగా
జరుగుతున్న ఈ నీశతోత్తర జయంతికి
వీరభద్రరావు, లక్ష్మీపతిగార్ల
ఆతిథ్యంలో గుబాళిస్తున్న

ఈ నీ హితకారిణి కవితా సదస్సుకు
వచ్చావు నీవు ఆనంద వసంతంలా !

అవును, రాకుండా ఎలావుంటావు?
నీవు వచ్చి కూర్చున్న సంగతి
మా అందరికీ తెలుసు !
తెలియకపోతే, మేం కవులమెలా అవుతాం ?

"అయితే - ముందే
పిలవలేదేం" అంటావా ?
మహాశయా !
తెలుగువాళ్ళ నైజం నీకు తెలియందేముంది?
మాలో ప్రతి ఒక్కడూ ఒకో పుంగవుడు !
మా కంటె గొప్పవాణ్ని మేం సహించం !
మా పంక్తిలో ఉన్నా, మేం గుర్తించం !

బాపురెడ్డి పిల్లవాడు కనుక
పిల్లవాడు దైవంలా అమాయకుడు కనుక
నిన్ను చూడగానే గుర్తించాడు !
గుర్తించగానే పిల్చేశాడు !
బాపురెడ్డి జిందాబాద్ !

వీరేశలింగం మహాశయా !
నీవు పుట్టేనాటికి
మా పరిస్థితి ఏమిటి ?

మా అధికారభాష ఏమిటి ?
పార్సీయో - ఇంగ్లీషో కదా !
మా నాగరిక వేషం ఏమిటి?
అరబ్బీ టోపో - ఇంగ్లీషు హేట్టో కదా !

మా లక్ష్మి స్వరూపిణులలో
అధిక సంఖ్యాకు లెవరు।
బాల బోడెమ్మలే కదా !

మా దేశభాషు స్థానం ఎక్కడ।
తద్దినం బ్రాహ్మల నోటేకదా !
ఈ దేశపు నిజమైన హక్కుదారుల
నివాసం ఎక్కడ ?
మాల మాదిగ మురికి గుడిసెల్లోనే కదా ?

గోహంతల రాజదర్బారులలో
గో బ్రాహ్మణ పూజలు !
పూజలకోసం జాతిని
నిర్వీర్యం చేసిన దాసులు !

వీరేశలింగం మహాశయా !
నీవు పుట్టేనాటికి
అదీ మా జాతి దుస్థితి !
పాలకోసం పొదుగు కోసి
నెత్తురుతాగుతున్న దానవులం మేం.

అప్పుడు నీవు పుట్టావు !
అరికట్టావు !
అమానుష దౌర్జన్యాన్ని !
అయావు నీవు —
వీరేశలింగం !
ఈ తెలుగు జాతికే జ్యోతిర్లింగం !

ఆ నాటి —
"అతనికి పొట్ట కోసినను
అక్షర మొక్కటి లేదు, కాగడన్
వెతికిన తెల్వి లేదు, దయ
వీసమునున్ కలనైన లేదు, ప్రో
న్నత నయవిద్య లేదు, పదు
నాల్గు పుటమ్ములు పెట్టి కాల్చినన్
చతురత - వాత పెట్టినను
సత్యము జిహ్వకు రాదు —"

(వీరేశలింగం - అభాగ్యోపాఖ్యానం)

అట్టి ఆ
అతనికి పొట్టకోయకయె
అక్షరముల్ లభియించె, కాగడన్
వెతకకె తెల్వి కన్పడియె,
వీశలుగా దయపుట్టె, శ్రీ ప్రదో
న్నత నయవిద్య పొంగె, మరి
నాల్కకు వాతలు లేకె సత్యముల్
చతురత కల్గె - ఈ తెలుగు
జాతికి జాతిపితా! భవత్ కృపిన్!

అంటూ నేను
నీకు జోహారులర్పిస్తున్నాను!
నేటి ఈ మా అభ్యుదయ పరంపర
నాటి నీ నాడు పొలాల పంట.

# పంతులుగారు : నాటకాలు

డా॥ పి. ఎస్. ఆర్. అప్పారావు

వీరేశలింగం పంతులుగారు క్రీ. శ. 1875 లోనే కాళిదాసు అభిజ్ఞాన శాకుంతలనాటకాన్ని అనువదించటానికి పూనుకొని, రెండంకాలు తమ "వివేకవర్ధని" లో ప్రకటించినారు. అదే సమయంలో విశాఖపట్టణంనుంచి శ్రీమాన్ పరవస్తు వేంకట రంగాచార్యులవారు అభిజ్ఞాన శాకుంతల నాటకానువాదాన్ని తమ "సకల విద్యాభివర్ధని" పత్రికలో ప్రకటించసాగినారు. రంగాచార్యులవారి అనువాదం పూర్తి అయినతరవాత అవసరమనిపిస్తే తమ అనువాదాన్ని కొనసాగించవచ్చునని పంతులుగారు నిశ్చయించుకొని, తమ అనువాదాన్ని నిలిపి వేసినారు. 1880 వరకు మరల వీరు నాటక రచనవైపే దృష్టిని పోనీయలేదు.

1880 లో వీరు చేసిన తొలిరచన "బ్రహ్మవివాహము" ఇది వీరి "హాస్య సంజీవని" లో ప్రకటితమైనది. "కులాచార విషయములలోను, రాజకీయ వ్యవహారములలోను గల అనేక దురాచారములను మాన్పుట కయి వివేకవర్ధనికంతర్భాగముగా పంతులుగారు హాస్యసంజీవని ప్రకటించినారు (స్వీయచరిత్ర 1 వ భా. పుట 175). అంతేకాక వీరివి వీరి వ్రాతలను దూషించుటకై కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు ప్రారంభించిన "హాస్యవర్ధని" కి ప్రతిగా కూడా ఈ "హాస్యసంజీవని" బయలుదేరినది (స్వీ. చ. 2 వ భా. పుట 182). ఈ హాస్యసంజీవనిలో అనేక ప్రహసనాలు ప్రకటితాలైనవి. ఇవి అన్నీ ఒకే సంపుటంలో నేడు లభిస్తున్నవి.

"అపూర్వ బ్రహ్మచర్య ప్రహసనము, విచిత్ర వివాహ ప్రహసనము, మహాబధిర ప్రహసనము, పునర్మరణ ప్రహసనము, బలాత్కారగాన వినోద ప్రహసనము, కలహప్రియా ప్రహసనము, మహామహోపాధ్యాయ ప్రహసనము, యోగనిద్రా ప్రహసనము, మహావంచక ప్రహసనము, అసహాయ శూర ప్రహసనము - అను పదియు నింగ్లీషులోనున్న ప్రహసనముల ననుసరించి పేరులను, కొంత కథను తెనుగువారి కనుకూలముగా నుండులాగున నేను మార్చివేసిన ప్రహసనములు. కౌతుకవర్ధని, వినోదతరంగిణి నాస్వకపోల కల్పితములైన ప్రహసనములు" అని పంతులుగారు తమ ప్రహసనములను గూర్చి వ్రాసుకొన్నారు (స్వీ. చ. 2 వ భా. పుటలు 241-42). 31-8-1886 తేదీన అత్తూరి లక్ష్మీనరసింహముగారినిగూర్చి "దంభాచార్య విలసనము" అనే ప్రహసనాన్ని వివేకవర్ధనిలో పంతులుగారు ప్రకటించినారు.

ప్రహసనములు కాక పంతులుగారు మొత్తం 16 నాటకాలు వ్రాసినారు. ఇందులో బ్రహ్మవివాహము, వ్యవహార ధర్మబోధిని, తిర్యగ్విద్వ

న్నపోసక, మహారణ్యపురాధిపత్యము - ఈ నాలుగు ప్రహసన ప్రాయములు, స్వతంత్ర రచనలు; రత్నావళి, అభిజ్ఞాన శాకుంతలము, మాళవికాగ్ని మిత్రము, ప్రబోధ చంద్రోదయము - ఈ నాలుగు సంస్కృత నాటకానువాదాలు; చమత్కార రత్నా వళి, వెనీసువర్తక చరిత్రము, రాగమంజరి, కల్యాణ కల్పవల్లి - ఈ నాలుగు ఆంగ్ల నాటకానుసరణ ములు. వివేక దీపిక స్వతంత్ర ప్రచార నాటకము; తక్కిన మూడు - ప్రహ్లాద నాటకము, దక్షిణగోగ్ర హణము, సత్య హరిశ్చంద్ర - స్వతంత్ర పౌరాణిక నాటకాలు.

బ్రాహ్మ వివాహము :

"బ్రాహ్మవివాహము" ను గూర్చి పంతులుగా రిట్లా వ్రాసుకొన్నారు - "నా నూతన మార్గాను సారముగా సంభాషణ రూపమున బ్రాహ్మవివాహ మును వ్రాసి హాస్య సంజీవని మొదటి పత్రికలో కొంత భాగమును ప్రకటించితిని. అవఱకు సంభా షణ రూపమున పుస్తకములు లేకపోవుటచేతనో, అందలి విషయనూతనత్వము చేతనో పురుషులును, స్త్రీలును, పండితులును, పామరులును, బాలురును, వృద్ధులును గూడ దాని నత్యాసక్తితో జదువ జొచ్చిరి. పుస్తకము వెలువడిన కొన్ని దినముల వఱకును జనులు గుంపులు గుంపులుగా గూడి వీధి యరుగులమీద గూర్చుండి దానిని చదివి పక పక నవ్వుచుండిరి. ఆ కాలమున బ్రాహ్మ వివాహ మును సాధారణముగా జనులు పెద్దయ్యగారి పెండ్లి పుస్తకమని వాడుచు వచ్చిరి. ఈ గ్రంథ మును నేను కేవలము వినోదముకొఱకు మాత్రమే కాక యతిబాల్యవివాహము, కన్యాశుల్కము మొదలైన దురాచారముల వలని యనర్థములను జూపి జనులను వానినుండి విముఖులను జేయు తలంపుతో గూడ వ్రాసితిని". (స్వీ. చ. 2 వ భా. పుట 176).

కాగా పంతులుగారు ఒక నాటకాన్ని వ్రాయా లన్న దృష్టితో బ్రాహ్మవివాహాన్ని రచించలేదనటం స్పష్టం. వీరుచేసినపని నాటకీయతకు ఒక చిహ్నమైన సంభాషణరూపంలో దానిని వ్రాయటమే. అందు చేతనే నాటకాలలో నిషిద్ధములైన భోజనాదులు- అందున పంక్తిభోజనాదులు - ఇందులో వర్ణితా లైనవి ఇందులో 7 అంకాలున్నవి; వీటిలో "ప్రదేశములు" అను పేర మరల రంగాలున్నవి. భమిడిపాటి కామేశ్వరరావుగారు ఈ సంపుటానికి "పరిచయ" వాక్యాలలో చెప్పినట్లుగా "బ్రాహ్మ వివాహము ఆ కాలములో జరుగుచుండిన పెళ్ళి ళ్ళను గురించిన కావ్యదూషణ, ముసలివాని పెళ్ళికి ఆడంగి సబబులు, పూర్వ శ్లోకములకు పెడ అర్థ ములు, ముసలి సబబులు, జ్యోతిషము చూచుట, నిశాలగ్నము, సాని మేళము, సభాతాంబూలపు గొడవలు, అపాత్రదానము, భోజనవేళ అలుగు టలు, చెక్కులు, రాత్రివేళ ఊరేగింపు చిక్కులు, అప్పగింతల వేళ ఏడ్పులు, ముసలి పెళ్ళిళ్ళ వల్ల కొందరకు కలిగెడు దుష్పరిణామాలు, కొందరకు పట్టెడి దుర్గతి మొదలైన విషయములు ఇందు నిరూపింపబడినవి" వీరేశలింగం" గ్రంథావళి 2 వ సంపుటము) నాటి వ్యక్తులే కొందరిందులో పాత్రలైనారు. తెలుగులోని ప్రహసనాలకు, అందునా కేవలం సాంఘిక సమస్యలతోటి రచనలకు బ్రాహ్మవివాహమే మొదటిదని చెప్పవచ్చు. ఇందులో పంతులుగారు తాము కొన్ని శ్లోకాలను కల్పించి, అవి ధర్మశాస్త్రాలలోనివని పాత్రలచేత పలికించినారు. ఈ విషయాన్ని పంతులుగారే వెల్లడించినారు

వ్యవహార ధర్మబోధిని :

హాస్య సంజీవనిలో బ్రాహ్మ వివాహ ప్రకట నము ముగిసిన వెంటనే పంతులుగారు "వ్యవహార ధర్మబోధిని" ప్రకటించ నారంభించినారు. ఈ

రచన వ్యావహారిక భాషలో సాగినది. పంతులు గారు వ్యావహారిక భాషావాది కాదు. నిజముగా ఆనాడిట్టి రచన సాహసమే అనవచ్చు. ఇందులో 6 అంకాలు, వాటిలో మరల "ప్రదేశాలు" అనే పేర రంగాలు ఉన్నవి "బ్రాహ్మవివాహము నందువలెనే ఇందలి పాత్రము లనేకములు నిజమైనవి. ఇందలి విషయము లనేకములు నిజముగా జరిగినవి. బ్రాహ్మవివాహమును వలె దీనినిగూడ జనులు విశేషముగా చదువుచు ప్లీడరు నాటకమని దీనిని పిలుచుచు వచ్చిరి" (స్వీ. చ 2 వ భా పుట 178). వ్యావహారిక భాషా విషయంలోనే కాక ఇంకొక విషయంలో కూడా ఈ వ్యవహార ధర్మబోధిని విశిష్టత నార్జించుకొన్నది. ఆధునిక యుగం తెలుగు నాటకాలలో ప్రదర్శనభాగ్యము గాంచిన తొలినాటకమిదే (నాటక పదం కేవలం Play అనే అర్థంలో ప్రయుక్తం) దీని ప్రదర్శనాన్ని గూర్చి పంతులుగారిట్లా వ్రాసుకొన్నారు.

"... వ్యవహార ధర్మబోధినిని నామిత్రులును కొందఱును, విద్యార్థులు కొందఱును జేరి 1880 వ సంవత్సరమున శ్రీ విజయనగరం మహారాజాగారి బాలికా పాఠశాలలో మొట్ట మొదట ప్రయోగించిరి. అందు న్యాయాధికారుల యొక్కయు, న్యాయవాదుల యొక్కయు, దుశ్చర్యలు సహజరూపమున ప్రకటింపబడినవి. వానిని ప్రదర్శించుటవలన నందభివర్ణింపబడిన దోషములుగలవారి మనస్సులకు గొంత నొప్పిగలిగినను, ఇటువంటి రూపకములను ప్రదర్శించుట కదియే మొదలయినందున నూఱుల కొలది జనులు వచ్చి చూచి యానందించిరి"(స్వీ. చ. 1 వ భా, పుట 178)". ...... నూఱుల కొలది జనులు చూడవచ్చుటయే కాక యందులో వర్ణింపబడిన న్యాయవాదులు సహితము కొందఱు చూడ వచ్చిరి. ఒక న్యాయవాదియొక్క మేనల్లుడు ప్రథమశాస్త్ర పరీక్షకు చదువుచుండిన విద్యార్థి యొకఁడా న్యాయవాదియొక్క వస్త్రములనే ధరించి వచ్చి కథ వినిపించుచుండగా జనులా న్యాయవాదివంక జూచి పక పక నవ్వజొచ్చిరి. ఆ న్యాయవాది యప్పుడేమియు ననక యందరివలెనే తానును నాటకమును జూచి సంతోషించి యింటికి బోయిన తరువాత తన బట్టలు వేసికొన్నందునకై మేనల్లుని మందలించెను" (స్వీ. చ. 2 వ భా. పుట 178).

పంతులుగారు వ్యవహార ధర్మబోధిని ప్రదర్శన కుద్దేశించి వ్రాయకపోయినను మొత్తమున కీ ప్రదర్శనము జయప్రదముగానే జరిగినదన్నమాట.

బ్రాహ్మవివాహము, వ్యవహారధర్మ బోధిని - ఈ రెండును కేవల వచననాటకములే.

వ్యవహార ధర్మ బోధిని ప్రదర్శనము విజయవంతం కావటంతో ఒక నాటకసమాజమును స్థాపించవలెనన్న అభిప్రాయము పంతులుగారికిని వీరి మిత్రులకును కలిగినది. "ఇట్టి నాటక ప్రదర్శనముల వలన జనులకు వినోదము కలుగుటయే కాక యక్రమములు చేయువారు సిగ్గుపడి తమ ప్రవర్తనమును దిద్దుకొనుటయు నందువలన నీతి వర్ధిల్లుటయు గలుగును గాన క్రొత్త నాటకములను జేసి నాటకసమాజము నొకదానిని స్థాపింపవలసినదని నా మిత్రులనేకులు నన్ను గోరిరి." అని పంతులుగారు వ్రాసుకొన్నారు (స్వీ. చ 1వ భా పుట 178)

ఇదే సమయంలో "ధార్వాడ నాటక సమాజము" వారు తెలుగు దేశంలో నాటక ప్రదర్శనలు ఇవ్వటం మొదలుపెట్టినారు తెలుగుదేశంలో ఆధునిక నాటక ప్రదర్శనలకు దారి చూపినవారు ఈ ధార్వాడవారే. వీరు ప్రదర్శనలిచ్చిన ప్రతి పట్టణంలోను ఒక నాటకసమాజం వెనువెంటనే బయలుదేరింది. ఆ విధంగానే రాజమండ్రి వారికి కూడా ఉత్సాహం కలిగింది. తాము స్థాపించిన

నాటక సమాజాన్ని గూర్చి పంతులుగారిట్లా వ్రాసుకొన్నారు – " నా మిత్రుల కోరిక ననుసరించి 1880 వ సంవత్సరములో కడపటి భాగమున నొక నాటక సమాజమును స్థాపించి, ధార్వాడ నాటకులు వచ్చి నాటకాములాడి విడిచిపోయిన పాఠశాలలోనే " రత్నావళి ", " చమత్కార రత్నావళి " యను రెండు నాటకములు చేసి యాడించితిని. అట్టి నాటకము లాడుట కదియే ప్రథమ ప్రయత్నమైనను, మొత్తముమీద నది జయప్రదముగానే జరిగినవని యెల్లవారు నభిప్రాయపడిరి (స్వీ. చ. 1 వ. భా. పుట 175).

ఆధునిక కాలంలో తెలుగుదేశంలో ప్రథమ నాటక సమాజాన్ని స్థాపించినఖ్యాతి పంతులుగారికే దక్కినది. ఇందులోని నటులంతా కళాశాల విద్యార్థులే కాని. నటులంటే గౌరవంలేని ఆ కాలంలో విద్యార్థులు నాటకాలు వేయడానికి వారి తల్లిదండ్రులు అంగీకరించలేదు " ...... ఈ నాటక ప్రయోగమువలన సహితవ. పట్టణములో సంక్షోభము కలుగక పోలేదు. ఆ నాటకములయందలి పాత్రము లు విస్తారముగా పాఠశాలలోనివిద్యార్థులు నాటకములలో వేషములు వేయుట గౌరవహాని కరమని యనేకుల అభిప్రాయనుగుటచేత విద్యార్థుల సంరక్షకులు తమ బాలురచేత వేషములు వేయించి నందు కయి నామీద నభియోగము తెచ్చెదమని నన్ను బెదరించిరి. నాటక ప్రదర్శనము వలన విశేషలాభము కలుగుననియు, నీతి వృద్ధి యగుననియు నేను దలచియుండినను, విద్యార్థులు నాటకము లాడుటయందలి యుత్సాహముచేత దమ పాఠములయందశ్రద్ధను జూపునట్లు కనబడినందున నాటక సమాజములయందటు తరువాత నేనంతగా నాదరము చూపుచు రాలేదు" (స్వీ. చ. 1 వ భా. పుటలు 175, 76).

రత్నావళి :

ఇది 1880 వ సం. కడపటి భాగంలో అనూదితమైనది. మూలాన్ని అనుసరించి వీరు దీనిని గద్యపద్యాత్మకంగానే తెనిగించినారు. ఈ అనువాదము అతిశీఘ్రకాలంలో జరిగినట్లు పంతులుగారే తెలిపినారు. సంస్కృత నాటకానువాదకు లెల్లరు ప్రస్తావనలందు సూత్రధారునిచేత తమ తమ అనువాదాలను గూర్చి కూడా చెప్పించుట కారంభించినారు ; కాని పంతులుగారా విధానాన్ని అవలంబించలేదు మూలంలోని ప్రాకృతభాగాన్ని కూడా పంతులుగారు గ్రాంథిక భాషలోనే అనువదించినారు ; అయినా పంతులుగారి భాషలోని విశిష్టత అయిన సారళ్యం ఇందులోను ఉంది.

చమత్కార రత్నావళి :

ఇదికూడా 1880 చివరిభాగంలో, రత్నావళితోపాటు, అదే ప్రయోజనంకోసం, శీఘ్రకాలంలో అనూదితమైనట్లు పంతులుగారు తెలిపినారు. కాని ఇందులోని మొదటి రెండంకాలు 1875లోనే వివేకవర్ధనిలో ప్రకటితాలైనవి. అప్పుడు అది అంతా ద్విపదలో ఉన్నది. పేర్లలో మార్పులు లేవు. ఇది 'Comedy of Errors' అనే షేక్స్పియరు నాటకానికి వచనానువాదం

పాత్రల. దేశాల పేర్లను మార్చివేసినారు (ధర్మపాలుడు – Solinus, the Duke of Ephesus ; వసంతకుడు – Antipholus ; చోళమండలము – Ephesus) ఇందువల్ల చదివేటప్పుడు ఇది స్వతంత్ర నాటకమనే భ్రాంతి కలుగుతుంది.

2. సేవకాదులకు, స్త్రీలకు వ్యావహారిక భాష నుపయోగించినారు.

3. ఆంగ్లంలోని పద్యభాగాన్నికూడా వచనంగానే అనువదించినారు.

4. రంగాలను, అంకాలను యథాతథంగానే ఉంచినారు- (ఇచ్చట "scene" అనేదాన్ని "రంగము" అన్నారు).

5. Aegeon అనే వర్తకుడు మరణదండనము విధించుమని డ్యూక్‌ను కోరుతున్న మాటలతో మూలము ఆకస్మికంగా ప్రారంభమవుతుంది. కాని పంతులుగారు ఈ మాటలకు ముందు ఒక పుట గ్రంథాన్ని పెంచి వ్రాసినారు. ఇది కథాప్రారంభానికి ఒకవిధమైన ఉపోద్ఘాతంగా పనిచేస్తుంది. అంతేకాదు స్వతంత్ర నాటకమనే భ్రాంతి కలిగిస్తుంది. (కాని ఇది షేక్స్పియర్ పద్ధతికి విరుద్ధము) ఈ విధంగా సన్నివేశాలలోకూడా పంతులుగారు అచ్చటచ్చట చిన్న చిన్న మార్పులు చేసినారు.

ఈ అనువాదంలో పంతులుగారు చాలా స్వాతంత్ర్యం చూపి, దీన్ని స్వతంత్ర నాటకంగా చేసినారనవచ్చు. అనువాదం చాలా బాగుంది. నేటి నాటక సమాజంవారు దీనిని చేపడితే తప్పక విజయంపొందగలరని విశ్వసిస్తున్నాను.

వివేకదీపిక :

ఇదికూడా 1880 నాటి రచనే. స్త్రీ పునర్వివాహానికి సంబంధించిన ఈ ప్రచార నాటకమంతా వచనంలోనే నడిచింది. ఇందులో ఉపన్యాసధోరణి ఎక్కువ; కాగా నాటకీయత తక్కువ.

పంతులుగారీ నాటకాన్ని పద్యకావ్యంగా చేయటానికికూడా ప్రయత్నించినారు కాని, దానిని పూర్తిచేయలేదు.

వినిసువర్తకచరిత్రము :

ఇదికూడ 1880 నాటి రచనే. పంతులుగారు "Merchant of venice" అనే షేక్స్పియరు నాటకంలోని మొదటి రెండంకాలు పై పేరుతో అనువదించి ప్రకటించినారు. ఇది అంతా ద్విపదలో ఉన్నది. పేర్లు మార్పులులేక యథాతథంగానే ఉన్నవి. అంకాలు రంగాలుకూడా యథాతథంగానే ఉన్నవి. ఈ అనువాదంలో సారళ్యం లోపించింది. కాని మూలానికి చాలాసన్నిహితము. "మర్చెంట్ ఆఫ్ వెనిస్" అనే నాటకములోని ప్రథమ - ద్వితీయాంకములను "వినిసువర్తకుని చరిత్ర" మను పేర ద్విపదకావ్యముగాచేసి ప్రకటించితిని" అని పంతులుగారు వ్రాసుకొన్నదానినిబట్టి వీరు దీనిని నాటకదృష్టితో తెనిగించలేదనుట స్పష్టము. పంతులుగారు దీనిని పూర్తిచేయలేదు.

అభిజ్ఞాన శాకుంతలము :

పంతులుగారు 1875 లోనే ఇందలి రెండంకాలు వివేకవర్ధనిలో ప్రకటించినారు. అభిజ్ఞాన శాకుంతలము ప్రదర్శనమునకు బాగుండునని, దానిని పూర్తిగా అనువదించవలెనని మిత్రులు కోరగా పంతులుగారు దీనిని 1883 లో పూర్తిచేసి ప్రకటించినారు. మొత్తంమీద దీనిరచన రెండు భాగాలుగా రెండు భిన్నకాలాలలో భిన్నదృష్టులతో సాగుటచేత ఈ రెండు భాగాల రచనలోను కొంత భేదము కన్పట్టుచున్నది.

"కావ్యేషు నాటకం రమ్యం, నాటకేషు శకుంతలా" అని వాడుక అట్టి శాకుంతలాను వాడానికి కామెట్లు సాహసించినారో పంతులుగారే తెలిపినారు.

"నా భాషాంతరము గూఢపదములును, ప్రౌఢాన్వయములును లేనిదయి పామరులును గ్రహించునట్లుగా తేటతెల్లమయి యుండును. తక్కినవారి భాషాంతరములుకఠినపద భూయిష్ఠములయి ప్రౌఢతరాన్వయ విశిష్టములయి పండితజన గ్రాహ్యములుగా నుండును. అయినను, సామాన్య జనులు మాత్రము నాపుస్తకమునే ఎక్కువగా జదువుచున్నప్పటికిని సమాదరము చూపుచున్నారు" (స్వీ. చ. 2 వ భా. పుటలు 189-90).

నిజానికి పంతులుగారి శాకుంతలము పండిత పామరులకే కాక నాటక సమాజములవారికిని అధికంగా ఆదరపాత్రమైనది. పంతులుగారి శాకుంతలాన్ని ప్రదర్శించని ప్రసిద్ధనాటక సమాజము లేదన్నచో అతిశయోక్తి కాజాలదు.

మాళవికాగ్నిమిత్రము :

1885 లో పంతులుగారు ఇంకో అయిదు నాటకాలు వ్రాసినారు - మాళవికాగ్నిమిత్రము, ప్రహ్లాద నాటకము, ప్రబోధచంద్రోదయము, రాగమంజరి, దక్షిణ గోగ్రహణము. 1885 లో తొలి రచన మాళవికాగ్నిమిత్రము (పీఠిక తేదీ 17-4-1885) ఇది కాళిదాసకృతమైన నాటకమున కనువాదము. ఇందలి శైలికొక ఉదాహరణము :

> " సర్వమును ప్రాతదని యెందు సాదుగాదు,
> క్రొత్తదనియెు కావ్యమునకు గొఱతరాదు,
> యోగ్యులు గ్రహింతురారసి యుత్తమంబు
> మూఢుడన్యులనే నమ్ము బుద్ధిలేక "

" పురాణమిత్యేవ నసాధుసర్వం " అనే ప్రస్తావన శ్లోకానికి ఇది అనువాదము.

ప్రహ్లాదనాటకము :

1885 లో సాగిన రెండవరచన ప్రహ్లాద నాటకము. ఇది 5 అంకాల స్వతంత్ర పౌరాణిక నాటకము. " ఒక నాటక సమాజమువారు కామాదహనటకయి ప్రహ్లాదుని కథను నాటకముగా వ్రాసి పెట్టుమని నన్నడుగగా 1885 వ సంవత్సరమునందతి త్వరితముగా ప్రహ్లాద నాటకము వ్రాసి ముద్రించితిని. నంఘ దురాచార సంస్కరణమును, పరిశుద్ధ మతధర్మ ప్రకటీకరణమును నామనస్సు నెప్పుడును బాయకుండును గాన నేనేపుస్తకమునైనను వానినించుక చొప్పించుచుండును. కాబట్టి యీ పుస్తకము నందును వాని చిహ్నములు కానవచ్చు " అని పంతులుగారు ఈ రచనగూర్చి వ్రాసుకొన్నారు.

ప్రబోధచంద్రోదయము :

పంతులుగారు ప్రబోధచంద్రోదయానువాదాన్ని 1885 లో ఆరంభించి, ఒక అంకంమాత్రమే వ్రాసి వివేకవర్ధనిలో ప్రకటించినారు. తరువాత 1891 ప్రారంభంలో దానిని పూర్తిచేసి చింతామణిలో కొంత కొంతగా ప్రకటించి, జూన్ 1891 లో పుస్తకరూపమున ప్రకటించినారు. (1891 లోనే " వివేకవర్ధని " నిలిచిపోయినది ; న్యాపతి సుబ్బారావు పంతులుగారి " చింతామణి " ప్రారంభమైనది. - ఈ రెండూ మాసపత్రికలే) ఈ నాటకానువాదాన్ని గూర్చి పంతులుగారు ఇట్లా వ్రాసుకొన్నారు - " ఇది అద్వైతమత సిద్ధాంతమును బ్రతిపాదించుటకయి చేయబడిన వేదాంత నాటకము. ఇందు వివేకునకు, మహామోహునకు పోరాటము జరిగి, కడపట వివేకునకు జయము కలిగినట్లువర్ణింపబడినది. ఇందలి పాత్రానుగుణముగా కొన్నిపద్యములు నాసామాన్య సులభశైలినికాక...కఠినశైలిని రచియింపబడినవి" స్వీ. చ. భా 2. పుట 192-93.

రాగమంజరి :

1885 లో వ్రాసిన నాలుగవ నాటకము " రాగమంజరి ". దీని రచనగూర్చి పంతుగారిట్లా వ్రాసుకొన్నారు - " ఇది షెరిడన్ అను ఇంగ్లీషు కవిచే రచియింపబడిన ' డ్యూయన్నా ' యను నాటకకథననుసరించి చేయబడినది. ఇందలి కథ రమ్యమయి యుండును. కథ యెంత మనోహరముగా నున్నను కొంచెము చిక్కుగా నుండుటచే సామాన్యజనులు దీనిని చక్కగా గ్రహించి పొందవలసినంత యానందమును బొందజాలరు" (స్వీ. చ. 2 వ భా. పుట 195).

షెరిడన్ ననుసరించి పంతులుగారు తమకు సమకాలికమైన సంఘమును విమర్శించినారు ఇందుకోసం అనుసరణలో పేర్లు మార్చివేసి, భారతీయ వాతావరణాన్నే కల్పించినారు

దక్షిణ గోగ్రహణము :

1885 లో వ్రాసిన ఐదవ నాటకము "దక్షిణ గోగ్రహణము". ఇది గద్య పద్యాత్మకమైన ఐదంకాల పౌరాణిక నాటకము. "రాగమంజరి కథ వలెగాక యీ కథకు మనవారలవాటుపడి దీనిని నెక్కువ యాదరముతో జదువుచు వచ్చిరి" అని పంతులుగారు తెలిపినారు. (స్వీ. చ. 2 వ భా. పుట 196).

తెలుగులో భారతకథను నాటకీకరించిన ప్రథములు పంతులుగారే

సత్యహరిశ్చంద్ర నాటకము :

దీని రచనగూర్చి పంతులుగారిట్లు వ్రాసుకొన్నారు – "రాజమహేంద్రవరమునందలి నాటకోజ్జీవక సమాజమువారు ప్రయోగించుటకై హరిశ్చంద్రోపాఖ్యానమును నాటక రూపముగా కథను మార్చక వ్రాసియిండని కోరగా వారి కోరికననుసరించి 1886 వ సంవత్సరమునందు రెండుమూడు వారములలో నాలుగంకములు రచించితినిగాని వారప్పుడు దానిని ప్రదర్శించుటకు వలనుపడనందున నంతటితో నిలిపితిని. తరువాత కాకినాడలోని యొక నాటకసమాజమువారు దానిని ఆ మాడుటకయి పూర్తి చేసియిండని యడుగగా వారము దినములలో పంచమాంకమునుగూడ జేసియిచ్చితిని. వారు దాని నాడినప్పుడు విశాలమైన నాటకశాలయంతయును చూడవచ్చిన జనులతో గ్రిక్కిరిసిపోయెను. చూచినవారందఱును నాటకమును బహువిధముల శ్లాఘించిరి. ఈ నాటకమును నేను మొదట వివేకవర్ధనిలో బ్రకటించి 1889 వ సంవత్సరమునందు పుస్తకరూపమున ముద్రింపించితిని" (స్వీ. చ. 2 వ భా. పుట 197)

శంకరకవి హరిశ్చంద్రోపాఖ్యానమును దీనితో పోల్చి, పంతులుగారి రచనయే మిన్నగా నున్నదని నిరూపించుచు కొండరాసాదు వ్యాసాలుకూడా వ్రాసినారు. తరువాతి వారనేకులు అనేక విధాలుగా హరిశ్చంద్ర కథను నాటకంగా వ్రాసినారు. (పైని పంతులుగారు పేర్కొన్న నాటకోజ్జీవక సమాజం పూర్తిపేరు "హిందూ నాటకోజ్జీవక సమాజము". దీనికి ప్రసిద్ధకవులు వడ్డాది సుబ్బారాయుడుగారు అధ్యక్షులు. ఇందులో వీరు పాత్రధారణకూడ చేసేవారు).

తిర్యగ్విద్వన్మహాసభ,

మహారణ్యపురాధిపత్యము :

ఈ రెండు రచనలనుగూర్చి పంతులుగారు ఇట్లు తెలిపినారు – "1896 వ సంవత్సరమునందు నేను తిర్యగ్విద్వన్మహాసభ, 'మహారణ్యపురాధిపత్యము' అను రెండు పుస్తకములను జేసితిని. వీనిలో మొదటిది నా మిత్రులైన బసవరాజు గవర్రాజుగారు మరణము నొందినప్పుడు వారి బంధువులను పురోహితులు మొదలయినవారు పెట్టిన బాధలను జూచినప్పుడు వారి దుశ్చర్యలను వెల్లడిచేయవలెనన్న యుద్దేశముతో చేయబడిన యాక్షేప గర్భ సంభాషణము. ఈ చిన్నినాటకములోని పాత్రములన్నియు పశువులును, పక్షులును వానివాని సంభాషణములు మిక్కిలి మనోహరములుగా నుండును. ఇది భారతములోని గృధ్రజంబుకోపాఖ్యానము మూలాధారముగా గొనిచేయబడినది. ఇదియును మూషకాసుర విజయమును నొక్కటిగా జేర్పబడి జంతు పాత్రములను దెలుపు చిత్రపటములతో ముద్రింపబడినది. పలూరి లక్ష్మీనరసింహముగారు

వారిమీద తెచ్చిన యభియోగములో కొందఱు విద్యాంసులీ చిన్న గ్రంథములోని యా యా పాత్రములు తమ్ముద్దేశించి వ్రాయబడెనని తమ సాక్ష్యములో తెప్పిరి.

" రెండవదియైన " మహారణ్యపురాధిపత్యము" ను పై దానియట్ల యాక్షేపగర్భనాటకమే. ఇందలి పాత్రములును తిర్యగ్జంతువులే. నక్క నీలికుండలో బడిన శరీరమున కంటుకొన్న నీలిరంగునుబట్టి తన బంధువులను మోసపుచ్చి తన్ను రాత్రి దేవతలు స్వర్గమునకు గొనిపోయి మృగరాజ్యమున కభిషిక్తునిజేసి నీలవర్ణము ప్రసాదించి పంపిరని బొంకి వాని సాహాయ్యమున మృగరాజయి కడపట నత్యము తేటపడగా నొక వ్యాఘ్రముచేత జంపబడె నన్న పంచతంత్రములోని కథ దీనికి మూలాధారము. ఇది సంఘములోగల వివిధ దురాచారములను వెల్లడిపఱిచి వానినిమాన్పింపవలెనన్న ముఖ్యోద్దేశముతో వినోదకరముగా వ్రాయబడిన గ్రంథము. ఇది మొట్టమొదట వివేకవర్ధనిలో భాగ భాగములుగా ప్రకటింపబడి తరువాత చిత్రపటములతో పుస్తకరూపమున ముద్రింపబడినది. ఇది తమ్ముద్దేశించి వ్రాయబడినదని యేలూరి లక్ష్మీనరసింహము గారు నాపైని న్యాయసభలలో నభియోగములు తెచ్చిరి " (స్వీ. చ. 2 వ భా పుటలు 202-03).

కల్యాణకల్పవల్లి :

పంతులుగారి నాటకాలలో ఇది చివరిది. " ఇది షెరిడన్ అనెడి ఇంగ్లీషుకవిచేత " ది రైవల్సు " (The Rivals) అను పేరుతో నత్యంత మనోహరముగా రచియింపబడిన యైదంకముల నాటకమునకు తెలుగు. ఇందలి కథ రాగమంజరి యితివృత్తముకంటెను నధిక హృదయాకర్షముగా నుండును అయినను మనవారికాదేశస్థుల యాచార వ్యవహారములు క్రొత్తవిగాను, తమవానికి విరుద్ధములుగాను కనబడుటచేత నిట్టివాని నంతగా నాదరింపరు. దీనిని 1894 వ సంవత్సరమునందు ముద్రించి ప్రకటించితిని ". అని పంతులుగారు తెలిపినారు. (స్వీ చ. 2 వ భా. పుట 208).

ఈవిధంగా నాటకరచన బహుళంగాచేసి, ఆధునిక యుగంలో తెలుగునాటకాల ప్రదర్శనకు మూలపురుషులైన పంతులుగారు తెలుగు నాటకరంగస్థల ప్రశంసలో ప్రథమగణ్యులు.



భాషారచనయందు స్వాతంత్ర్యము వహించిన తీయని వాక్కిండ్లు తీసినాడు
విజ్ఞాన దృష్టి మూసిన శాస్త్రములు చీల్చి జనమనోదాస్యంబుజంపినాడు
కులమత ద్వేష శృంఖలల నుచ్ఛేదించి జాతీయ భావంబు చాటినాడు
స్వహానామతాచార ఘటిల కృత్యనులందు పరమాస్తిక వ్యక్తి నెఱపినాడు
ఆదయాత్రవత మూర్త్యద్యోభిమానిని, సంఘ సంస్కార దీక్షా తపస్వి
యలరు నీరేశలింగ మహర్షి యొకడె, ప్రస్తుతాంధ్రోదయమునకు బ్రహ్మయగుచు.

— శ్రీ రాయప్రోలు సుబ్బారావు

బాల వివాహముల్ మిగుల బాధల పాలొనరించు నంచు మా
ర్గాలను జూపినట్టి గుణగణ్యా మహోద్ధరణ ప్రబోధ వి
ద్యాలయ హృద్య మీ పలుకులందు యథార్థము లేకయున్నచో
ఏల ధరాస్థలిన్ కడురహించెడు మీదగు కీర్తి సాంద్రమై.

సుకుమార గుణశీల సుందరాకార తా
    విస్వస్థలకు పెండ్లి వేడ్కమీర
కావించి నాడవు కఠినాత్ములకు గుండె
    లదిరి శాపులు దప్ప వ్యాసరచన
సాగించి నాడవచంచల దీక్షతో
    వర్ణరాహిత్య వైవాహికముల
నొనరించినాడవు గని యనాథులకునై
    శరణాలయాలను కరుణతోడ

స్థాపనమొనర్చి నిస్వార్థ సంఘములను
పేరుగాంచితి నిలకందుకూరివంశ
జండ! వీరేశలింగ యాఖ్యుండ! తెలుగు
దేశరత్నమై వెలసిన దివ్యమూర్తి.



# సంస్మరణ

## జోస్యము జనార్దనశాస్త్రి

పృథ్వి ॥ సపాదశత హాయనంబులు ప్రజామనస్సీమలన్
ప్రపూత హిత నాద మోదరసభావ పూర్ణంబుగా
విపంచికలు మేళవించితి నవీనరాగమ్ములన్
జపమ్ము తపమ్ము ఫలించునది జన్మసాఫల్యమై.

శా॥ ఏరీ? నీ సరి నైజభావముల సక్లేవెల్లడింపగ నౌ
శూరుల్? వానిఁ బ్రజాసమూహమున నచ్చుంగ్రుద్ధి చెప్పంగ నౌ
ధీరుల్? స్వైరవితండ వాదముల యుద్రేకంబు చల్లార్ప నౌ
వీరుల్? లోకహితంపు మేల్ మనసరుల్? వీరేశలింగ ప్రభూ!

ఉ॥ రంగుమెఱుంగులన్ మెఱిక రంగు నసుంగు తెనుంగుకైతజాల్
పొంగులు చెంగలింప, కవిపుంగవ! దేశము దిద్దితీర్పవే
భంగులు శక్తియుక్తులఁ, బ్రవక్తవుగా కవిగా పరిష్కృతా
భంగర సప్రవాహికలు పారఁగఁజేసితి నాఁడు నేటికిన్.

మత్త॥ సన్నహాస్య ప్రసన్నతా కథసంపుటైతల ప్రాంతలన్
పున్నెపుంబుట భేదనంబునఁ బుట్టు వందితి దిట్టవై
పున్నమాంబక మూల్య పుందొలిపుట్టు నోములపంటవై
కన్న దేశము, ఉద్ధతిగుమగా వలంతివి బంతివై.

ఉ॥ నెక్కొనుపాండితీధృతి మనీషఁ
బ్రజాభ్యుదయాభివృద్ధికై
నిక్కిన మూఢభావములు నిల్వున
నీఱయి కూలిపోవు మేల్
ఫక్కిని తక్కొరుల్ నడవరాని విధాన
తెనుంగు సాహితిన్
త్రొక్కని త్రోవలేదు నెఱితోఁ దఱితో
గుఱితోచు రీతితో.

ఉ॥ నాఁడటు లంకురార్పణ మొనర్చిన సంస్కరణంపు బీజముల్
నేఁడిదె వేరుదన్ని యవనీజము లాయత భూరి శాఖలై
యూడలువారెఁ; స్వాదురసయుక్త ఫలంబులు దండి పండగాఁ
జీడల దుల్చి దోహదము సేయు విధాన మనుగ్రహింపుమా!.

*

# నవయుగ వైతాళిక ప్రశస్తి

యస్. వి. రాఘవేంద్రరావు

ఏ మహాయుఁడీవి వెలయించి సమున్నత విద్య నిల్పెనో
ఏ మహనీయుఁడాత్మ నలరించు శతాధిక కావ్యకర్తయో,
ఏ మహనీయు ధీ పటిమ నింతుల వంతలు దూరమయ్యెనో,
ఆ మహనీయుఁ, బూజ్యకవి, నా యుగపూరుషు నాత్మఁగొల్చెదన్.

పెంపగు నంధ పద్ధతులఁ బేర్చిన మూఢుల కుక్కు కత్తియై,
యింపున సాని కొంపలఁ జరించు రసజ్ఞుల ప్రక్క బల్లెమై,
పెంపగు లంచగొండ్లఁ దగ పీఁచ మడంపఁగ గుండె గాలమై,
తెంపగు నీదు సంస్కరణ దివ్యముకాఁదె? వివేక వర్ధనా!

అలనాఁడే ఘన రాజమహేంద్రపురి విద్యా జ్యోతి నీ చేతితో
వేవెగిఁపంబడి, నేఁడఖండ మగు దీప్తిన్ తేజరిల్లంగ మా
న్యులు, దక్షుల్, కరుణా సముద్రులు, సుధీయుక్తుల్ సమీక్షింపఁగా
నిల నిష్కంప నివాతమై సతము వర్ధిల్లున్ జగన్మాన్యమై.

"స్త్రీబుద్ధిః ప్రళయాంతకే" యనిరి, యా స్త్రీబుద్ధికిన్ దోడు వి
ద్యా బంధంబు చెలంగుచో స్థితులనూహ్యంబంచు వాదించు చిం
తా బద్ధాత్ముల నోర్చి, చేసితివి విద్యాగంధి సంభూతలన్;
పూఁబోఁడుల్ నిను విస్మరింప రిల సంపూజ్యాంధ్ర వైతాళికా!

హరిజనులనంగ నా శ్రీ
హరిజనులని గాంధి కన్న నతి పూర్వం బీ
ధరఁ జాటి, వారి స్థితి ను
ద్ధరింప సమకట్టితీవు దళితోద్ధరణా!



# కందుకూరి వీరేశలింగం

పెద్దాడ రామస్వామి

స్వశ్లాఘాపేత స్వప్రయోజనపరత్వము, స్వార్థ జీవనము, బహువ్యాప్తమై యున్నరోజులలో, అధికారంచాటున అన్యాయం వికృతరూపమున తాండవమాడు కాళరాత్రియందు ప్రేమప్రధాన జీవియై సంఘమునందు గౌరవస్థానము నలంకరింప వలసినస్త్రీ నికృష్ట జీవనమున క్రమ్మగ్గుచు [illegible] బడియుండిన అంధకారయుగమున యథార్థ స్వార్థ రాహిత్యప్రధానమైన వైరాగ్యమును ఆచరణలో ప్రదర్శించిన కర్మయోగి, ధర్మయోధుడు అగు మహాపురుషుని జీవిత సంస్మరణము అంతరంగమున శానందమువలె బలమును ప్రసాదించకపోదు. దేశ హితైకమగు సర్వతోముఖసేవచేసి సాహిత్యరచన, జ్ఞానప్రబోధము దురాచారనిర్మూలనము దీనజనోద్ధరణము మొదలగు సత్కార్యనిర్వహణము నందు అసామాన్య ధైర్యసాహసములచే కృతకృత్యుడై ప్రతిఫలాపేక్ష నెరుగని అర్ధశతాబ్దపు నిష్కళంక దేశసేవచే ఆధునికాంధ్రపితామహుడని సార్థకనామ ధారియై విఖ్యాతిగాంచిన శ్రీవీరేశలింగంజీవితము సింహావలోకనము చేయుట పవిత్రఉత్సాహప్రద మగుట నిస్సంశయము.

1848 వ సంవత్సరం ఏప్రిల్ 16 వ తేదిని జన్మించి 1919 సం. మేనెల 27 వ తేదిని దేహయాత్ర చాలించినాడు. చిన్ననాటినుండియు, ఆయనమనస్సునందు, అన్యాయము యెడల రోషము, దీనులయెడ కనికరము, సత్యప్రకటన యందు నిర్భయత్వము, అంతరంగ ప్రబోధము ననుసరించుటయందు సాహసము అనులక్షణములు విశేషముగా కన్పట్టుచుండెను. సంఘప్రముఖుల యందు వేశ్యాలోలత్వము, అధికారమదాంధుల యందు అన్యాయవర్తనము, మొదలగు సాంఘిక దుర్వృత్తులను చూచి సహింపలేక పటిమగల తన కలముచేత వాటిని నిరసించి తీవ్రముగా ఖండించుటచే ఆయన రోషానలమునకు అడ్డువారు తహతహలాడుచుండిరి. అతిబాల్యవివాహము, వృద్ధవివాహము, నిర్బంధవైధవ్యము, మొదలగు దురాచారముల మీదదాడి ఆయనప్రారంభించెను. ఆయన ఉపన్యాసములవలన బయలుదేరిన తీవ్రసంచలనము దేశమంతటను అపూర్వచైతన్యమును కలుగచేసినది. 1881 వ సం. డిశెంబరు 11 వ తేదిని ప్రథమవితంతు వివాహమును జరిపినపుడు, రాజమహేంద్రవరము అట్టుడికినట్లు ఉడికిపోయెను. పౌరప్రముఖుల సహాయ్యము, అంతకంటె ముఖ్యముగా విద్యార్థుల ఉత్సాహోద్రేకములు, ఆయనకు అప్రతిహతమైన బలమును ధైర్యమును కలిగింపసాగెను. పరమేశ్వరప్రీత్యర్థమే కార్యాచరణమునకు దిగువాడును, సత్కార్యసాధనయందు అనన్య చింతగల దీక్ష కల

వాడును అగుటచే, తాను పూనిన ఉద్యమమునకు తనశక్తిసామర్థ్యముల లోటులేక వినియోగించి దేశసౌభాగ్యలక్ష్మికి రక్షణకర్తయైన స్త్రీజనముల ఆదరాభిమానములను మాత్రమే గాక కృతజ్ఞతాశీర్వాదములను సహితము పొందకలిగినాడు. శతముఖములుగా ప్రకటితమగుచుండు భావదాస్యమును తొలగించుచు అభ్యుదయహేతువులగు కార్యములకు ఉనికిపట్టయిన మేరువువలె ధైర్యసాహసములతో పోరాడుటయందు అనన్యసామాన్యయోధుడని దేశమాయనను పరిగణించజొచ్చెను.

జనసామాన్యమునందు పాదుకొనియున్న మూఢనమ్మకలను పారదోలుటకు సులభగ్రాహ్యమగు వచనశైలి ఆయనకు అవసరమాయెను. బాలబాలికలకునైతము గ్రాహ్యముకాగల సామాన్యభాషయందు నానావిషయములనుగూర్చి వ్రాయుచు, అందుమూలమున గృహాంతరములందుండు స్త్రీలకు కూడ జ్ఞానవికాసమును ప్రసాదించుటకు కృషి సల్పెను. భయములేక ధైర్యమూని సత్యమునే ఆధారముచేసికొని దురాచారసమూహమును ఒంటరిగా ఢీకొని అంధప్రాయముగా ఏపూర్వసాంప్రదాయములను కూడా అనుసరింపకూడదు అను భావమును కలుగచేయవలసివచ్చెను.

ఉపన్యాసవేదికలపై ప్రసంగములచేతను వివేకవర్ధని మొదలైన పత్రికలయందు హేతువాదమును అనుసరించిన వ్యాసములచేతను, పూర్వాచారదుర్గమును కదల్చివేసెను. 'వృద్ధవివాహము' వంటి నాటకములు, వివిధవిషయ సంబంధములయిన ప్రహసనములు శాస్త్రజ్ఞానప్రదాయకములగు సులభగ్రంథములు, దేశీయమహాసభ వంటి సంఘచరిత్రలు, సంస్కృత, ఆంగ్ల నాటకములకనువాదములు స్వకల్పితనాటకములు, కవులచరిత్ర — ఇవన్నియు సంస్కరణాచార్యునకు అత్యవసరములైన ఆయుధములయ్యెను. జ్ఞానమును వికసింప చేయవలెననెడి ఉత్సాహమును చిరకాలానుగతముగ వచ్చుచుండిన సాంఘికాచారములను వివేచనతో పరిశీలించు స్వభావము తనబుద్ధికి సత్యమని తోచినదానిని నిర్భయముగా ప్రకటించుట ఆయనకు అలవాటు. ఆ ప్రకటితాభిప్రాయమును ఆచరణలోనికి తెచ్చుట ప్రతిమానవునకు ప్రధానకర్తవ్యమని విద్యార్థులు మాత్రమే గాక సామాన్యప్రజకూడ గ్రహించ మొదలిడిరి. వంగదేశమునందు రామమోహన రాయలు, ఈశ్వరచంద్రవిద్యాసాగరులు, ఒనర్చిన సాంఘిక సేవను, సాహిత్యసేవను వీరేశలింగం ఒక్కడే ఆంధ్రదేశమునందు నెరవేర్పకలిగెను. 'వ్యవహార ధర్మబోధిని' "బ్రాహ్మవివాహము" వివిధనాటకములు, జంతుశాస్త్రము, జ్యోతిశాస్త్రాది శాస్త్రములు "పత్నిహితసూచిని" "ఉత్తమస్త్రీలజీవితములు" వంటి స్త్రీలకుపయుక్తమగు గ్రంథములు "నీతిచంద్రిక" "కథామంజరి" "రాజశేఖర చరిత్ర" "సత్యసంజీవని" "జీసస్ చరిత్ర" మొదలగు గ్రంథములనేకము రచించి ఆంధ్రప్రజల కపారమైన ఉత్తేజమును కలుగచేసెను.

సంఘసంస్కరణకు హాస్యరసమును ఒక అమోఘమైన అస్త్రముగా వినియోగపరచి తీవ్ర వివేచనాశక్తిని రగులుకొల్పి ఆచారముల యందలి అంధవిశ్వాసమును పటాపంచలుచేసెను. కృత్రిమజీవితము హేయమైన ఈశ్వరద్రోహమనియెడి భావము ప్రజలలో కలుగ నారంభించెను. ఆయన నవలా వాఙ్మయమునకు దారితీసెను. వచనారచన నియమబద్ధము చేయుటకు వ్యాకరణమును రచించెను. కేవల వచనరచన మాత్రముగాక శుద్ధాంధ్ర ఉత్తర రామాయణమును శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధము మొదలగు పద్యకావ్యములను రచించెను అమూల్యమై ఆదర్శప్రాయ

మైన తన జీవితమును విపులముగా వ్రాసి ఆంధ్ర భాషయందలి ప్రప్రథమ స్వీయచరిత్రకు గ్రంథకర్త యయ్యెను.

ఇట్లు ఆంధ్రసమాజమును నిద్రనుండి మేల్కొలిపి, ఆంధ్రసాహిత్యమునకును తనమార్గముల నేర్పరచి, స్త్రీలోకమునకు స్వేచ్ఛాగ్రంథమును నవజీవనవికాసమును ప్రసాదించిన ఈమహాపురుషుని నేను 16, 17 సంవత్సరముల బాలుడనై విద్యార్థిగా నున్నదినములలో 1909 వ సం. లో చూచుభాగ్యమును పొందితిని. దుర్బలశరీరుడై, వ్యాధిగ్రస్తుడై, నిరాడంబర వేషధారియై రంగుధోవతి, నల్లకోటు, ఎర్రజరీ పాగ, ముడతలుపడ్డముఖముతో, ఈవృద్ధయోధుని చూచినపుడు తీక్షణదృష్టిగల ఆకన్నులుమాత్రము నన్నాకర్షించినవి. ఆయన ఉపన్యాసము కూడ ప్రప్రథమముగా ఆరోజునే వింటిని ఈశ్వర ఆరాధనము యొక్క ఆవశ్యకతను గూర్చి అచ్చట సమావేశమైయున్న కొందరు యువకులకు ప్రబోధించుచు అక్కడవున్న ఒక హార్మోనియమును మాకుచూపి, త్రికరణశుద్ధిగల జీవితముఅవసరమనియు మనఆశయములు కార్యరూపమున దాల్చునియెడల మన పాటలు, ప్రార్థనలు ఆహార్మోనియముపాటలకంటె ఎక్కువ శావనియు, ఆనాడు ఆయనచేసిన ప్రసంగము యిప్పటికిని నాచెవులలో ప్రతిధ్వనించుచునే యున్నది మరొక పెద్దసభయందు గూడ శానధ్యక్షుడుగానుండి శుష్కవాదములు చేయుచుండిన ఒక వ్యక్తిని తీవ్రముగాఖండించుచుండుట నేనెరుంగుదును.

1918 వ సంవత్సరంలో రాజమహేంద్రవర ప్రార్థనసమాజవార్షికోత్సవములో నేనుకావించిన చిన్న ఉపన్యాసమునకు ఆయన సంతోషింపగా, అయన ఆమోదమును ఆశీర్వాదమును పొందు భాగ్యము కల్గినదనిచెప్పుట నాకృతజ్ఞత అగును కాని ఆత్మస్తుతి కానేరదు. ఉపాసనాంతరము ఆయన స్వయముగా పురమందిరమున నూతనముగా తెరువబడిన ఆస్తికపుస్తకాలయమును నాకు చూపియుండిరి.

మేముకొందరము మరిఒకసారి బ్రహ్మసమాజ యువకులము, ఆనందోద్యానమున వారిని దర్శించపోతిమి. వితంతు శరణాలయము ప్రక్కనున్న తన నివాసగృహమందు వీధివసారాలో పడకకుర్చీ మీద కూర్చొనియున్నపుడు మామనస్సుల నానాడు కలవరపెట్టుచున్నసమస్యను — బ్రాహ్మధర్మదీక్షగైకొన్నవారు, కులతత్వముమీద ఆధారపడ్డ బ్రాహ్మణేతర సభలవంటి ఉద్యమములలో పాల్గొనుట, అసందర్భము అనర్థదాయకము అగునా కాదా? అన్నప్రశ్న ఆయన ఎదుటపెట్టి ఆయన సలహాను అడుగగా, కులతత్వసిద్ధాంతమును ఆయన నిర్మొగమాటముగా ఖండించియుండెను. తరువాత ఆయన మమ్ములను తోటలోనికి తీసికొనిపోయి ప్రతివృక్షము ప్రతిలత యొక్కవృత్తాంతమును సొంతముగా మాకు చెప్పసాగెను. ఎప్పుడును పురోగామి కనుకనే పూర్వపుశైలిని కఠోరనియమబద్ధమైన బహుగ్రంథములకు కర్తయయ్యును భాషాస్వాతంత్ర్యవాదియైన శ్రీ గిడుగు రామమూర్తి గారు స్థాపించిన వర్తమాన ఆంధ్రభాషాప్రవర్తక సమాజమునకు అధ్యక్షుడుగా నుండుటకు సంకోచపడలేదు. తానుచేసిన సమస్త ప్రయత్నములలోను ఛాయవలె దనతోడనుండి ప్రోత్సహించుచుధర్మమార్గానుసరణమునందు సత్యమైన సహధర్మచారిణియై ప్రాణమునకు ప్రాణమై తన అర్ధాంగలక్ష్మియైన రాజ్యలక్ష్మమ్మగారికి తనస్వీయచరిత్రము నంకితము చేసి నారీలోకమునందు తనకుగల గౌరవమును ప్రకటించెను. సామాన్యఉపాధ్యాయ వృత్తియందుండియు తనస్వార్జితధనం వెచ్చించి ఆంధ్రదేశమునందలి ప్రథమ పురమందిరమును రాజమహేంద్రవరమున

నిర్మించి వారి పౌరధర్మనిర్వహణమునకు మార్గదర్శి యయ్యెను. ఇంకను ప్రార్థనసమాజమందిరము, పఠనమందిరము, ఆస్తికోన్నత పాఠశాల, హితకారిణీసమాజము, శరణాలయము, మొదలైన సంస్థలను నిర్మించి, తానార్జించినధనమును, తాను కట్టుకొన్న నివాసగృహమును తనతపోవనమును కర్మక్షేత్రమును అయిన ఆనందోద్యానవనమును దేశమునకు దానపట్టాలతో నిచ్చివేసెను. వానిని మాత్రము ఉచితరీతిని, శోభాయమానముగా నిర్వహింపలేకపోవుట శోచనీయము.

రాజమహేంద్రవరమునందు రహదారి వీధిని యున్న ఆయన శిథిలశిలావిగ్రహమును చూచినపుడు ఈ మహాపురుషుడు ఒక చక్కనివిగ్రహమునకైనను నోచుకొనలేదా అను దుఃఖము కలుగును.

Hindu Code blil విషయమై ఢిల్లీలో శాశతశాసనసభ యందలి వాదప్రతివాదములు చదివినపుడు, రాజకీయరంగమునందు విప్లవవాదులైన వారు సైతము దానిని ప్రతిఘటించుట చూచినపుడు వీరేశలింగ విద్యాసాగరులకృషి యింకను పూర్ణముగా ఫలించలేదేమో ననియు రాజకీయ సంస్కరణకంటె సాంఘికసంస్కారం కష్టతరమేమో అనియు రాజకీయముగా ఆర్థికముగా సాంఘికముగా సమానసంస్కారభావము కలిగియుండుట దేశశక్తిని సంకుచితపరచుటయేమో అనిపించును. ఊహించుట కష్టము. ఆయన స్వీయచరిత్రమునందలి కడపటివిన్నపముచదివిన హృదయము ద్రవీభూతము గానిఆంధ్రులుందురా అని తోచును. విశేషధనముగాని బలముగాని అధికారముగాని లేక దేశాభిమానము సేవాపరాయణత్వము మాత్రము కలిగి, ప్రతికూలవంత మారుతములు ఎంతతీవ్రముగ వీచుచున్నను తానుసంకల్పించి, స్థాపించి, పోషించిన నానాసంస్థలను జీర్ణము కాకుండ ఉద్ధరింపుమని చేతులజోడించి వేడుకొనుచున్నాడు. రాజకీయ, ఆర్థిక, సాంఘికవిషయములందు సమాన సమగ్ర సంతతాభివృద్ధిని సాధింపుమని ఆయన ఎలుగెత్తి ప్రబోధించుచున్నాడు.

మహాత్ముని సత్యాగ్రహసహాయ నిరాకరణోద్యమములయందు ఆంధ్రులు అసమానధైర్యసాహసముల ప్రదర్శింపకలుగుట ఆయన దేశసేవాపరాయణత్వమునందు పెట్టినవరవడివల్లనే అని దేశమిదివరకే గ్రహించినది. పరస్పరదూషణ పాండిత్యముచే, వాగ్వాదప్రతిభచే త్యాగమయకార్యరాహిత్యముచే దేశసౌభాగ్యమును ధ్వంసముచేసికొన నేర్చిన మనము ఈవైతాళికుని జీవితరహస్యము గ్రహించి కార్యమునందే శూరత్వమును చూపుట సత్యాగ్రహాచరణమునందే పోటీలు పెట్టుకొనుట నేర్చుకొందముగాక! ఏకమార్గానుగామి యైన ఆంధ్రభాషాప్రవాహమును పలుముఖముల ప్రవహింపచేసిన సంఘజీవనమునందు ఆత్మపారిశుధ్యము, స్వార్థత్యాగము, అంతరాత్మ ఆదేశానుసారముగా నడచుకొనుట శ్రేయోసాధనకు మార్గములవి క్రియారూపముగా నేర్పిన ఈ మహావైతాళికుని అనుసరించి ఆయన అప్తులమైన మనమందరము ధన్యులము అగుదుముగాక!

# మూఢాచారాలు - కందుకూరి తిరుగుబాటు

హేమలతా లవణం

ఇప్పటికి వందసంవత్సరాలనాటివిషయం. సమాజం చైతన్యరహితమై మౌఢ్యంలో, అమాయకత్వంలో మునిగిన రోజులవి. మతఛాందసాన్ని, మతాధిపతుల అక్రమాలను, సంఘదురాచారాలను ఎదిరించే ధైర్యం కలుగని సమాజమది. అట్టి రోజులలో ఒక కుర్రవాడు తాను పెద్దలద్వారా విన్న విషయాలను, పుస్తకాలలో చదివిన సంగతులు సత్యానికెంతదూరంలోవున్నవో తెలుసుకోవలెనని ప్రత్యక్షానుభవం పొందాలనే అన్వేషణ ప్రారంభిస్తాడు. గుడ్డినమ్మకంతో తాను నిద్రపోక, మంత్రాలకు ప్రభావంవుందని పెద్దలుచెప్పగా నమ్మాడు. మంత్రప్రభావాలకు దెయ్యాలు పారిపోతాయని నమ్మాడు భూతవైద్యుల మంత్రతంత్రాలను చూచాడు. ఆభూతాలను స్వయంగా చూడాలనుకున్నాడు. అందుకు ప్రయత్నంచేశాడు. చైతన్యరహితమైన ఆనాటి సమాజంమధ్య యిదే ఆకుర్రవాని చైతన్యం. దయ్యాలుపట్టిన స్త్రీలువున్న ఇండ్లకుపోయి ఆ స్త్రీలను చూచాడు. దయ్యం కనబడలేదు. భూతవైద్యులగృహాలచుట్టూతిరిగాడు. భూతాలు కనబడలేదు. భూతవైద్యులను ప్రాధేయపడ్డాడు. ఒక్క భూతాన్నైనా చూపించమని అయినా ఫలితం కలుగలేదు. శ్మశానంలో దయ్యాలు అర్ధరాత్రి సమయాన నాట్యంచేస్తుంటాయని విని స్మశానానికి వెళ్ళాడు. అనేకమార్లు ఒంటరిగా. అక్కడా భూతాలు లేవు. ఈకుర్రవాని ఉత్సాహం చూసి ఒక భూతవైద్యుడు భూతాలను చూపుతానని ఒకనాటిరాత్రి ఊరికిదూరంగావున్న మఱ్ఱిచెట్టు వద్దకు తీసుకుపోయి "చూపినచో నీవు జడిసికొంటావు" అని తప్పించుకోబోయాడు. "నేను జంకను. నాయందు దయవుంచి తప్పక చూపు" కుర్రవాని పట్టుదలచూసి భూతవైద్యుడు చిక్కుకపడ్డాడు. తప్పించుకొంటానికి అవకాశందొరికే విధంగాలేదు. చివరికి "నీవు భయపడకపోయినా, ప్రభుత్వమువారివలన వాకు చిక్కువచ్చును. నేను చూపను" అంటూపారిపోయాడు. మూఢాచారాలను అనుసరిస్తూ, మూఢనమ్మకాలతోవుండి, మంత్రతంత్రాలను నమ్మి భూతవైద్యులచే వైద్యం చేయించుకొనే కుటుంబంలో పుట్టి, పెరిగి, తనచుట్టూ అట్టి వాతావరణమే ఉన్నా తాను విన్నవిషయాన్ని పరిశోధించాలనే చైతన్యం కలిగి "జంకను" అన్న యీ కుర్రవాడే కందుకూరి వీరేశలింగం. ఆ చైతన్యం, సత్యాన్వేషణ ఆయన్ను సంస్కర్తగా

మార్చివేసింది. సంఘ దురాచారాలపై తిరుగుబాటుదారునిగా దిద్దింది. జీవితాంతం అతడు జంకలేదు.

యుద్ధవీరుడు ఖడ్గబలంతో విజిగీషతో శత్రువును ఎదుర్కొంటాడు. కేవలం రాజ్యకాంక్షతో శత్రువును తయారుచేసుకుంటాడు. అయితే అతని హృదయం కాఠిన్యంవహించాలి, కరుణరహితం కావాలి. అప్పుడే వీరుడు యుద్ధంనెగ్గగలుగుతాడు. తన మోసపు పన్నాగాలవల్ల ఎందరో మరణిస్తే, మరెందరో క్షతగాత్రులైతే అతనికి విజయం లభిస్తుంది. సంస్కర్తకూడా వీరుడే అతనివైరం శత్రువుతోకాదు. అనేకుల జీవితాలకు అడ్డుతగిలి, అన్యాయం, అక్రమం నిండివున్న దురాచారం, అతని శత్రువు. సంఘమౌఢ్యం అతనిప్రత్యర్థి. ఇందు అతనిచేత ఖడ్గం వుండదు. నిజాయితీ, త్యాగం, సాహసం, పట్టుదల యీతని ఆయుధాలు. ఈ ఆయుధాల ధాటికి ఎదిరిమూఢత్వం మూర్ఖత్వం, ఓడిపోకతప్పదు. అయితే ఇందులో సంస్కర్తకేకాదు, ఎదిరికూడా విజయుడౌతాడు, యుద్ధవీరులకన్నా సంస్కర్తయందే ధైర్యం, సాహసం యెక్కువ. యుద్ధవీరుడు శత్రువుద్వేషాన్ని, కోపాన్ని ఒక్కసారే రుచిచూస్తాడు సంస్కర్త ప్రతినిమిషం, జీవితాంతం మూఢుల, మతఛాందసుల, మతోన్మాదుల ద్వేషానికి, కోపానికి గురిఅయి వారుచేసే అవమానాన్ని అనుభవించవలసి వుంటుంది. క్రీస్తు, సొక్రటీస్, గాంధి, యిందుకే చంపబడ్డారు. రాజారామమోహనుడు సంఘవ్యతిరేకతను, కోపాన్ని అనుభవించాడు. కందుకూరి వీరుడు. సంఘవ్యతిరేకతను కోపాని. బహిష్కరణను జీవితమంతా అనుభవించారు. అందుకే ఆయన యుద్ధవీరుని మించిన శూరుడు.

మూఢనమ్మకాలు, మూఢాచారాలు సాంఘిక జీవనంలో ఎక్కడెక్కడ అడ్డుపడుతూవచ్చాయో వాటినన్నింటిని ఎదుర్కొంటూ వాటి సంహారానికి పూనుకొని దెబ్బదెండ్ల తన జీవితంలో తృప్తిని నప్ప విశ్రాంతిని పొందలేదు. ఈనాడు తెలుగుల జీవితంలో మూఢనమ్మకాలు, దురాచారాలు కొంత సడలివుండటానికి కారణభూతుడు కందుకూరి.

కందుకూరివారి తల్లికి భూతపీడిత భ్రమ చాలా వుండేది. అభయంతో ఆమె తన్ను భూతం ఆవహించినదనిమంత్రాలు, తాయెత్తులు, భూతవైద్యం చేయించుకుంటూ దినదినం నీరసించిపోతూ వుండేది బెంగవలన. అప్పటికే కందుకూరివారికి భూతాలు, మంత్రతంత్రాలపై పూర్తిగా నమ్మకంపోయింది. తల్లికి ఎన్నివిధాల నచ్చచెప్పినా ఫలితంలేకపోయింది. అంచేత ఆఊరికి వచ్చిన ఒక భూతవైద్యుణ్ణి - తమ ఇంట అతిథిగావుండమని తనతల్లికి ఆరోగ్యం కలిగించమన్నాడు. దీనితో అటుతల్లికి, ఇటు ఊరివారికి భూతవైద్యం, మంత్రాలు, తప్పు జరగని పని అని నమ్మికకలిగించవచ్చు ననుకున్నాడు.

భూతవైద్యం చేస్తున్న యీ బ్రాహ్మణయోగి వేషధారణ అందరికీ భయంకలిగిస్తూ వుండేది మాంచి బలం, పొడగరి అయిన అతను అతిభోజన ప్రియుడు. నలుగురైదుగురితో సమానంగాతినేవాడట. భూతవైద్యుడితిండి, ఇతర ఆడంబరాలుపెరుగుతున్నాయేకాని తల్లి ఆరోగ్యంమాత్రం దిగజారిపోతున్నదట. రోజురోజుకూ ఏదో ఒక మిషచేత కందుకూరివద్ద డబ్బుతీసికొనేవాడు ఇలా పదిహేనురోజులు జరిగాయి ఫలితం శూన్యం. భూతవైద్యుని ఆడంబరం, అహంభావం, మోసానికి కందుకూరివారు విసిగెత్తి ఒకనాడు ఇంటినుండి పొమ్మన్నారు భూతవైద్యుని. భూతవైద్యునికి కోపంవచ్చింది. అసలురూపంచాల్చి కందుకూరిని తిట్టడం ప్రారంభించాడు. కందుకూరి అందరి యెదుట అతని మెడబెట్టి గెట్టించారు. దానితో

మరింత రౌద్రంతో భూతవైద్యుడు ఎదురింట్లో చేరి, అక్కడ ఏవో ముగ్గులు వేసి. మంత్రాలు చదువుతూ రోజూ కందుకూరిని ఉద్దేశించి చేసేవాడు. ఊరి వారు, చుట్టుప్రక్కలవారు, తల్లి, బంధువులు అందరూ కందుకూరికి ముప్పువస్తుందని భయపడ్డారు. కాని ఒకనాడు ముగ్గుచుట్టూ తిరుగుతున్న భూతవైద్యుడు తూలి క్రిందపడ్డాడు. దానితో తనను మరోభూతం పట్టిందని, అది కందుకూరి పంపిన భూతం అని భయపడి జ్వరపడ్డాడు జ్వరం యొక్కవై కందుకూరివారి పేరు పలవరిస్తూవుంటే, కందుకూరి జాలిపడి ఆ భూతవైద్యుని తన ఇంటికి తెచ్చారు. నెలరోజులు అతనికి వైద్యం చేయించారు. ఏనుగువంటివాడు పీనుగవలె అయినాడట ఆరోగ్యం చిక్కాక కందుకూరి ఇచ్చిన దారిబత్తెంతో ఊరుచేరాడు భూతవైద్యుడు.

ఇది జరిగి నూరేండ్లు దాటాయి. ఈనాడు యీ విషయం చదువుతూవుంటే చాల సామాన్యమైనదిగా తోచవచ్చు. కాని ఆరోజులలో భూతవైద్యుని ఎదుర్కొనడం అంటే సామాన్యమైనవిషయం కాదు. ఎంతో ఎదిరింపు, గుండె దిటవు వుంటేనే చేయగలరు అసత్యం, మూఢత్వంపై తిరుగుబాటు యిక్కడనుంచే ప్రారంభమైంది.

సంస్కర్తకవి కానక్కరలేదు. కాని కవిఅయిన వాడు సంస్కర్తకూడా అయితే సంఘానికి కవిగా తన రచనాపాటవంచేత మానసిక చైతన్యం కలిగించడమేగాక, సంస్కరణచేత సాంఘిక న్యాయాన్ని పంచివ్వగలడు. కవితకు క్రాంతిని తోడుచేసుకొన్నవాడు కందుకూరి. భాషకందని గుండెధైర్యం, వర్ణనకు దొరకని కార్యశూరత్వం ఆయన ఆయుధాలు.

కందుకూరివారి ఇంటిపెరటిలో అరటిచెట్టు ఒకటి ఏకారణముచేతనో కొననుండి వేయక నడుమ నుండి చీల్చుకొని పువ్వు పైకివచ్చి గెలవేసింది. ఇది అరిష్టసూచకమని, వెంటనే చెట్టు కొట్టివేయమని ఇరుగుపొరుగువారు, బంధువులు పట్టుబట్టారు. చెట్టు కొట్టివేయడం సులువే, కాని కందుకూరివారులోని మూఢనమ్మకాన్ని నరికివేయదలచారు. అందుకే వారిమాట చెవినిబెట్టక, చెట్టును అట్లే వుంచారు. మొదటిలో జనం గుంపులు గుంపులుగావచ్చి యీ వింతను చూచిపోయేవారు. తరువాత ఆచెట్టు గెల ఎదిగి కాయలు వంటకు అక్కరకువచ్చాక, దూటకొరకు చెట్టును కొట్టించారు.

ఇంటి దూలాలలో ఒకదానికి తేనెపట్టు పట్టింది. అది అశుభసూచకమని, దోషపరిహారార్థం బ్రాహ్మణులచేత శాంతికర్మ చేయించాలన్నారు అందరూ. ఎవరెంత పోరాడినా కందుకూరి వినక, చలించక నిలిచి ఆ తేనెపట్టును అట్లే వుంచారు.

ఊహాపోహాలకుగాక ప్రతివిషయాన్ని ఆచరణ ద్వారా శోధించి సత్యాసత్యనిరూపణ చేయడం ఆయన సహజగుణం. ఒకపని మంచిదని నమ్మినప్పుడు, అది తనకేగాక అందరికీ మంచిదని విశ్వసించినప్పుడు దానిని నెరవేర్చడానికి ఆయన వెనుదీయరు. వజ్రకర్కశమైన పట్టుదల ఆయనిది.

కోరంగి అనే గ్రామంలో ఇంగ్లీషు టీచరుగా ఉద్యోగంరాగా మంచిముహూర్తంచూచి చేరమని అందరూ సలహా ఇచ్చారు వారి నిర్బంధాన్ని లక్ష్యంచేయక అమావాస్యనాడు బయలుదేరి పనిలో ప్రవేశించి, పనిముఖ్యం, పనిలోచేరి నీతి, నిజాయితీగా మసలడం ప్రధానం కాని ముహూర్తంకాదని నిరూపించారు

సంఘ దురాచారానికి ఎదురుతిరగడమంటే, మొత్తం సమాజాన్ని శత్రువుగా చేసుకోవడమన్నమాట. సంస్కరణకు దిగిన ఆవేశులు విమర్శలకు, ఒత్తిడులకు భయపడి వెనక్కుతగ్గారు. ఈ నాటికీ

ఆశీస్సులిచ్చారు. విమర్శలకు, బహిష్కరణకు, ఈసడింపులకు జంకని, లొంగని వ్యక్తి కందుకూరి. తన పనిలోని న్యాయాన్ని, సత్యాన్ని తెలుసుకొన్న మనిషి. మోసాన్ని సహించని యీ మానవునికి ఏమోసం ఎక్కడవున్నా, అక్రమం ఎక్కడ దాగిన దానిని వెలికితీసి న్యాయంకూర్చడమే తన పనిగా పెట్టుకొన్నారు కందుకూరి.

వివాహాలకు భోగంమేళాలు పెట్టించడం, అడంబరమైన గొప్పకోసం వేశ్యాగమనం, అనాటి మర్యాద. అదొక ఆచారం. ఈ ఆచారం స్త్రీ వ్యక్తిత్వాన్ని నాశనంచేసి, స్త్రీ గౌరవాన్ని మట్టి కలిపేదిగావుంది. అందుకే యీపద్ధతికి స్వస్తిచెప్పా లనుకున్నారు కందుకూరి.

భోగంమేళమునకు "వసూళ్ళు" అనే పద్ధతి వుంది. వివాహానికి వచ్చినవారంతా ఒకటి, రెండు రూపాయలు చెల్లించాలి. దానిని వేశ్యలకు బహు మానంగా యిస్తారు. ఆరోజులలో 1 రూపాయంటే రెండురోజులు ఒక కుటుంబం జీవిస్తుంది. ఈ పద్ధతి బలవంతమైనది ఇవ్వలేనివారైనా సరే వారింట్లో వస్తువు తాకట్టుపెట్టి అయినా సరే వసూళ్ళ డబ్బు ఇవ్వాలి. అధికారులు యీవసూళ్ళు చేస్తారు, ఈ డబ్బు యివ్వలేక కొందరు వివాహాలకు పోవడమే మానుకుంటారు. అలా మానుకున్నవారిని కూడా యీ అధికారులు వదలరు ఇవ్వలేని బలహీనులు, ఆ ఊరిలో ఉండటమేకష్టమయేది. భోగంమేళాన్ని వసూళ్ళపద్ధతిని మాన్పించడానికి కార్యక్రమం తీసుకొని, వివేకవర్ధనిలో దానిలోని చెడ్డతనాన్ని గూర్చి వ్రాసి ప్రచారంచేశారు. తాను జరిపించిన యే వివాహంలోను తనసహచరుల వివాహాలలోను భోగంమేళాలు లేకుండా చేశారు.

శవసంస్కారవిషయంలో కూడా ఒకమార్పు కై కృషిచేయాలని కందుకూరి, అయన సహచ రుడు గవర్రాజు నిర్ణయించుకొన్నారు. శవ సంస్కారం హృదయవిదారంగా వుండటంచూ శారు. మృతశిశువును కుక్కలు, నక్కలు లాగడం చూచిన కందుకూరివారి మనస్సు ద్రవించి, దాని కొక నూతనమైనమార్పు చేద్దామనుకున్నారు. గవర్రాజుగారి ప్రథమసంతానం మూడు నెలలు జీవించి మరణించగా, ఆ శిశువును మామూలు పద్ధతిలోగాక, ఒక పెట్టెలోపెట్టి, దాని మూతికి మేకులుగొట్టి గవర్రాజుగారి తోటయందే ఒకమూల సమాధిచేయించారు. బ్రాహ్మణ మతాచారానికి భిన్నమైన యీవిధానం మతోన్మాదులకు, సాంప్ర దాయపు ఛాందసులకు, బంధువులకు సహింపరాని దైనది. కందుకూరిపై విరుచుకుపడ్డారు. కేసు పెట్టాలని సిద్ధపడ్డారు. ఎటుచూసినా మౌఢ్యం, ఛాందసం ముసిరివున్న ఆనాటిసమాజంలో యింతటి మార్పులు ఆచరణద్వారా చూపడానికి ఎంతో ఎది రింపుశక్తి, దానికి మించిన సంస్కారం వుంటేనే ముందడుగు వేయగలరు అందుకే కందుకూరి మహా వీరుడు

"విద్యావంతులైనవారుకూడ వివేకదీపం వంక చూడక మూఢాచారాలను పట్టుకు ప్రాకులాడు తారు. ఆచారపిశాచం ఆవహించినవారికి దయ, ధర్మం, సత్యం సర్వమూ పరిత్యాజ్యములు" అంటారు కందుకూరి.

వితంతు వివాహాలేగాక, వితంతు మాతృత్వాన్ని మానవతాదృష్టితోచూసి, పరిష్కరించి, ఆ వితంతు వుకు పునర్వివాహంచేసిన వీరేశలింగదంపతుల జీవి తాలు, వారి ఆచరణను అనుకరించి మనం ఆచ రించి చూపడమే వారియెడ మనగౌరవప్రదర్శనం.

# ప్రసంశ

బులుసు సీతారామశాస్త్రి

జననం బొందితి వీవు శ్రోత్రియవు వంశంబందు సన్మాన్య సా
వన నీతి ప్రియ వర్తనంబులెసఁగ విద్వాంసుల్ ప్రశంసింపఁగా
ఘన విద్యల్ కడు నల్పకాలమునసే కంఠస్థముల్ చేసి మే
లని మెచ్చంగ గడించి నీవు విని ననంఖ్యాకంబులౌ గ్రంథముల్

ఆచారప్రియవర్తనుండ వయిమూఢాచార మార్గాను సా
రాచార్యత్వము నొందు పామరజన వ్యామోహరీతుల్ సదూ
హాచాతుర్యముతో నడంచితివి దీక్షాయుక్తతన్ నీదు స
ద్వాచాప్రౌఢిమ నెన్న నేరితరమౌ ధన్యాత్మ వీరేశ్వరా!

నీ దేహము నీగేహము
నీదౌ సకలంబును దయనీయస్థితి నా
వేదన పడుజనులకునై
ఆదృతి నర్పించి ధన్యుఁడైతి మహాత్మా.

కలమే ఖడ్గము కన్న మిన్నయను సంకల్పంబుతో నీవు సం
కలనంబుం బొనరించినాఁడవు మహాగ్రంథావళుల్ వానితో
ఖలదుర్వాదములెల్ల ఖండితములై గ్రాలన్ మహాతీవ్రమై
విలసిల్లెంగద నీదువాణి భువిలో వీరేశలింగాహ్వయా!



# నవయుగ విధాత

## అద్దేపల్లి వివేకానందాదేవి

నవయుగ విధాతా నారీలోక జీవనామృతదాతా
నీవేయిఫుడు మాతోఫుంటే నీ ఘనత మాకు తెలిసేదా
నీదారి మాకునచ్చేదా, నీ మాట నవ్వులాటగా వుండేదా
నలుగురు పోయినదారిని పోవడం నవత
నమ్మినబాటను నడవకపోవడం నాగరికత
సంధర్భాను సారస్నేహం సాంగత్యానికి సహజం
నాగరికతా నవతలకివి నవనాడులు
అనినమ్మే మాలో నీవేయిపుడు ఫుంటే
నీఘనతమేము మెచ్చేమా, నీదారి మాకు నచ్చేదా
నవయుగవిధాతా, నవసారస్వత మంజరీ సంజాతా
నాన్ సేలబుల్ కమోడిటివో, నాన్ షెలంట్ మనిషివో
నువ్వు అయ్యోవాడివి నవతను అడ్డే అనాగరికుడవు నువ్వనీ
నలుగురూ చేరి నాట్యంచూస్తే నానారభసాచేసే అరసికుడవనీ
నాచ్ పార్టీలను నిషేధించే "నాన్ సోషబుల్ ఎలిమెంటువనీ"
నవ్విపారేసి "నాన్ సెన్సు" పత్తిఛాందసుడోయ్ అని
అవహేళనచేసియుండమా ఓ అనాధ జనరక్షకా
ఆశ్రిత స్త్రీ పరిరక్షకా అందుకో మా జోహారులు.

అయినా ఆచోచిస్తే అతిచిత్రం జరిగింది.
పసికందులకు పండ్లూడిన వారికి పెళ్లి
పండుముదుసలులకు, పెళ్లిపండుగ మళ్లీమళ్లీ
ప్రాయంరానివారికి పాపంబద్ధలైందని ప్రాయశ్చిత్తాలు

పశుపతిని కొలిచే పశుప్రాయులు
ప్రాజ్ఞత తెలుసనుకొన్న పరమమూఢుల
పట్టినపాతకాలపు చాంధసపు బూజులు
దులిపావు నీధీరుచితో పలికావు పసిడిపలుకులు.
యువతరంనడిచింది యథాశక్తి నీవైపు
నీమలోని సమత వారి హృదిలోని మమతగా
నీహృదిలోని నవత వారి జీవితాల ఘనతగా
నడచింది యువతరం సడలింది యుగభారం
అందుకే నీవు అతివలపాలిటి రసధునివి
అజ్ఞానుల కొక పరశు వేధవి.
శ్రీ జనకల్పవల్లీ ఆశ్రితజనరంగవల్లీ
నీవేయిప్పుడు మాతోవుంటే మాలో రేగిన నైరాశ్యం
మాలో పెరిగిన నౌర్ధ్యం, మటుమాయంచేయవా
మాన్ప్రశాంతిలోయి ఇముందేవా, మానవతావాదీ
మాకోసం నువ్వు మారణహోమం అయ్యావు
మళ్ళీ మళ్ళీ చెప్పావు ధర్మపన్నాలెన్నో
అయినా మేము మారలేదు మరిచాము నిన్ను.
మాతరానికీయి ఉత్సాహాన్ని
యువతరానికీయి ఉల్లాసాన్ని

నవ్యాంధ్ర నిర్మాతా నమోవాకాలు నీకివాడు.
శ్రీ రాజ్యలక్ష్మి శ్రీ వీరేశలింగహృదయ చైతన్య లక్ష్మి
స్త్రీ జన మానస సంక్షోభ నివారణ లక్ష్మి
కల్లోలిత సంఘ సంక్షేమ కారణ లక్ష్మి
ఆంధ్రావని వెలిసిన ఆనంద రాజ్యలక్ష్మి
అందుకో మా జోహారులు ఆంధ్రమహిళాలోక నీరాజనాలు.



# యుగపురుషుడు

సి. హెచ్. రాజలింగం

వెన్నవంటిమనస్సు మిన్నంటెడియశస్సు
పువ్వుపుట్టగానె పరిమళం వికసించెను భాషాజ్ఞానం
ఇది భగవత్ ప్రసాదం స్వీకరించెను రాజమహేంద్రవరం
పున్నమప్రసరించిన వెలుగు చీకటి తెరలు తొలుగు
కండబలంలేకపోయినా గుండెబలమధికం
దేహబలంతక్కువ బుద్ధిబలమెక్కువ
విద్యయే బ్రతుకుతెరువు విద్యలేనిచో బ్రతుకుబరువు
విద్య అంతులేనిది విజ్ఞానం అనంతమైనది
సాహిత్యసేవ సకలార్థములకు త్రోవ
సంఘసేవయే జీవితమునకు చేవ
ఆజన్మత్యాగశీలి బహుముఖ ప్రజ్ఞాశాలి
నవయుగ వైతాళికుడు యీ యుగానికి వారసుడు
ధవళేశ్వరమున పాఠశాల భువనమంతసాకెనేల
వివేకవర్ధని పత్రిక అది మహిషాసురమర్దని
విజ్ఞానతరంగమె కలియుగానికి వీరేశలింగం
వంచకులకు లంచగొండులకు సంఘవిద్రోహులకు
మూఢనమ్మకాలకు అశయాల పిడుగు
స్త్రీ కంటనీరొలకిన ఇంటసిరినిలువదని
తలలు బోడులైనా తలపులు బోడులుకావని
త్యాగమెధనమని భోగమె తృణమని
సాహిత్య సవ్యసాచి మహాతపస్వీమార్గదర్శి
కందుకూరి స్వీయచరిత్ర జ్యోతివంటి నీతికిపాత్ర
అలిచల్లని ఆదేశాలు మదిఝల్లును సందేశాలు.

*

# పరిశుద్ధాస్తికుడు

## కోదాటి నారాయణరావు

స్వర్గీయ కందుకూరి వీరేశలింగం పంతులుగారు దేశానికి చేసిన బహుముఖ సేవలలో కేవలం ఏదో ఒక ప్రత్యేక అంశాన్ని తీసుకుని పరిశీలించకుండా అన్ని అంశాలను సమగ్రంగా పరిశీలిస్తే ఆయనలోని ప్రత్యేకత పరిశుద్ధత అని తేలుతుంది. వంచన, మోసము, కపటము మొదలైనవాటికి ఆయన సంపూర్ణంగా విరోధి. ఆయన సంఘ సంస్కరణకు పూనుకున్నాడంటే పూర్వాచారము పేరిట జరుగుతున్న వంచనను చూచి ఏవగించుకుని దానికి విరుద్ధంగా సంస్కరణోద్యమాన్ని ప్రారంభించాడు. అల్లే భాషావిషయంలోను పాండిత్య ప్రకర్షకై జరుగుతున్న అట్టహాసము, కృత్రిమత ఆయన సహించలేకపోయినాడు. అందువలననే భాషలో సౌలభ్యాన్ని డొంకతిరుగుడు లేకుండా సూటిగా స్పష్టంగాచెప్పే రచనావిధానాన్ని ప్రవేశపెట్టడానికి ప్రయత్నించాడు.

నేనీమాటలంటున్నప్పుడు ఆయన సంఘసంస్కరణ ఉద్యమ విలువను తగ్గించదలచినట్లుకాదు. కాని ఆయన ఆశయం అంతకంటె గొప్పదని చెప్పదలచుకున్నాను. ఆయన తన విశ్వాసాన్ని పరిశుద్ధ ఆస్తికతగా పేర్కొన్నాడు బహుశా పాశ్చాత్య దేశాలలో ఇంతకు చాలాకాలముందే విజృంభించిన "ప్యూరిటన్" ఉద్యమము ఆయనకు స్ఫూర్తిని కలిగించిందేమో!

ఆయన పరిశుద్ధతా ఉద్యమంవల్ల చాలామంది ఆప్తులను పోగొట్టుకున్నా విచారించలేదు. తనకు వారితోగల చిరకాలస్నేహం పోతుందని బాధపడలేదు. సంఘంలో వారికిగల పలుకుబడివల్ల తనకు అపకారం జరుగుతుందనికూడా వెరవలేదు. వారిలో తనకు కనిపించిన నైతిక విరుద్ధ ప్రవర్తనకు విరుద్ధంగా ఆందోళన సాగించాడు. ఉదాహరణకు స్వర్గీయ ఆత్మూరి లక్ష్మీనరసింహ సోమయాజిగారు వీరేశలింగంగారికి పరమమిత్రులు. పంతులుగారి సంఘసంస్కరణోద్యమానికి ఆయన మనస్ఫూర్తిగా సహకరించేవారు. అయితే సోమయాజిగారి ఉద్యోగ నిర్వహణసందర్భంలో పంతులుగారికి కనిపించిన దొసగు - అది కొద్దిపాటిదే కావచ్చు - ఆయన సహించలేకపోయినాడు. దానికి విరుద్ధంగా తన పత్రికలో ఆందోళన సాగించాడు. దానిని రుజువు చేసారు. ఇదంతా ఆయన తన స్వీయచరిత్రలో వ్రాసుకున్నారుకూడా. దీని ఫలితంగా లక్ష్మీనరసింహంగారు పంతులుగారిస్నేహాన్ని వదులుకోవడమేకాదు, ఈ ఉద్యమంనుండే వేరైనారు. వైశ్య వేదోక్త క్రియాచారవిధానానికి తమ సంపూర్ణ శక్తిని వినియోగించారు తర్వాత, పంతులుగారు కేవలం సంఘసంస్కరణోద్యమాన్ని మాత్రమే అభి

లభించి ఉంటే లక్ష్మీనరసింహంగారిలో వారికి కనిపించిన దోసగు బహిర్గతంచేసి ఆందోళన జరిపి ఉండే వారుకాదు. కాని పంతులుగారు సహజంగా Puritan. ఎక్కడ ఏమాత్రం అపరిశుద్ధత కనిపించినా సహించడం వారివల్ల అయ్యేపనికాదు. అందువల్ల ఎటువంటి పరిణామాలు సంభవిస్తాయో నని కూడా వారు ఆలోచించేదిలేదు.

ఇంకో సందర్భంలో ఆంధ్రభీష్మ న్యాపతి సుబ్బారావు పంతులుగారివంటి వారిస్నేహాన్ని కూడా వదులుకోవలసి వచ్చింది. సుబ్బారావు పంతులుగారున్నూ, వీరేశలింగం పంతులుగారి ప్రముఖ మిత్రులలో ఒకరు. పంతులుగారి ఉద్యమాలకు ఎంతో అండగా నిలిచారు. అయితే వారి కుటుంబంలో సంస్కరణావివాహం చేయవలసివచ్చినప్పుడు అది న్యాపతివారికి ఇష్టంలేదని తెలిసి ఉన్నప్పటికీ కూడా తాను ధైర్యంగా ఆ వివాహాన్ని జరిపించి దానికి ఫలితంగా సుబ్బారావు పంతులుగారి స్నేహాన్ని పోగొట్టుకున్నారు. ఇదికూడా వారి స్వీయచరిత్రలో ఉదాహరించబడింది ఇటువంటివి అనేకం వారుచేసారు. ప్రభుత్వోద్యోగాలలో ఉండి లంచాలుతీసుకుంటున్న వారిప్రవర్తనకు విరుద్ధంగా ఆందోళన లేవదీసారు. వాటిని కోర్టులలో రుజువుచేసారు చివరకు పంతులుగారి ఈ వైఖరివల్ల కొందరు ఆయన ప్రియశిష్యులే ఆయనకు వ్యతిరేకము అయిన సన్నివేశాలు కూడా ఉన్నవి. పంతులుగారి జీవితాశయం కేవలం సంఘసంస్కరణ, వితంతు వివాహాలే అయిఉంటే వారు తమ దృష్టినంతా ఆఉద్యమంపైననే కేంద్రీకరించి ఉండిఉండేవారు. అంతేకాని మిగతా రంగాలలో జరుగుతున్న అన్యాయాలను, అక్రమాలను, బైటపెట్టి అట్టివారికి గుణపాఠం నేర్పడం తలపెట్టిఉండకపోయేవారు కాని పంతులుగారు పరిశుద్ధతావాదులు కాబట్టి ఎక్కడ మోసము, వంచనా మొదలైనవి కనిపిస్తే, అది పూర్వాచారమైనా, ఆధునికాచారమైనా దానిని ఖండిస్తూ వచ్చారు, ఆపోరాటంలో ఆయన ఎటువంటి నష్టకష్టాలను సహించడానికి కూడా వెనుతీయలేదు. అందుచేతనే పంతులుగారిని సంఘసంస్కర్త దేశారాధకుడు బ్రాహ్మమత ప్రబోధకుడు అని వేరు వేరుగా నిర్వచించేకంటే ఆయన పరిశుద్ధాస్తికుడంటే ఆయనశీలాన్ని సమగ్రంగా నిర్వచించినట్లవుతుందని నేననుకుంటాను. గాంధీమహాత్ముని జీవితము సత్యపరిశోధన అవుతే వీరేశలింగం గారి జీవితం పరిశుద్ధతకై పోరాటం అనిచెప్పవచ్చును.

# నువ్వు పుట్టకపోతే

స్వర్గీయ శశాంక

నువ్వు పుట్టకపోతే ఈ దేశం
ఇప్పటికీ మూలపడ్డ వితంతువులా
ముసుగేసుకునే ఉండేది
నువ్వు పుట్టావు కనుక
ఈ దేశం ఇప్పుడు
నవ వధువులా
నవనవోన్మేషంగా ఉంది!

మహాత్ముల్ని సృష్టించడంలోనే భగవంతుడు
అద్భుతాల్ని ప్రదర్శిస్తాడని ప్రతీతి
నీవంటి అరిపేదని సృష్టించి
నీచే ఎన్నో బృహత్తరకార్యాల్ని చేయించడంకన్నా
అద్భుతం ఏముంటుంది లోకంలో !

పుట్టెడు అనారోగ్యంతో
పుట్టినప్పటినుంచీ నువ్వు బాధపడుతూవచ్చినా
ఈలోకపుటనారోగ్యాన్ని రూపుమాపడానికి
నీకన్న మంచి భిషక్కులు దొరకలేదు మాకు
అదంతా నీచేతి చలవ !

ముక్కుపచ్చలారకుండానే
ముండామొయ్యడానికి అలవాటుపడ్డ ఆడబిడ్డలు
ఈడూజోడూ అయిన సంబంధాలు చేసుకొని
ఈనాడెంతో హాయిగా బతుకుతున్నారు.

గడపదాటి కాలు బయటపెట్టని కన్నెపిల్లలు
కాలేజీలకువెళ్ళి గౌరవంగా చదువుకొంటున్నారు
వంటఇంటి కుందేళ్లలా మగ్గిపోయేగృహిణులు
భయరహితంగా ప్రపంచాన్ని గెలుచుకొంటున్నారు.

మగవాళ్ళ అడుగులకు మడుగులొత్తుమగువలు
మగవాడితో సరిసమానంగా పరిగణింపబడుతున్నారు
బానిసలకే బానిసలుగా బతికిన భారతనారుల్ని
బంధవిముక్తుల్ని చేసిన మహోద్యమంనీది

భారతస్త్రీకి విముక్తివచ్చిందిక నకనే
భారతజాతికి విముక్తివచ్చింది
నీపుట్టుకతో
ఈదేశం జాతకమే మారిపోయింది.

వర్ణాంతరవివాహాలు సాగుతోంటే
వాదోపవాదాలు లేవదియ్యడం లేదీనాడు
వితంతువివాహాలు జరుగుతోంటే
విడ్డూరంగా చూడ్డంలేదెవళ్ళు.

చచ్చుపుచ్చు విషయాలతో
సాహిత్యాన్ని ఖరాబుచేసేరోజులుపోయి
సమాజ సముద్ధరణమే
సాహిత్యానికి అంతిమలక్ష్యమైపోయింది.

నీకన్నా గొప్ప కవులుంటే ఉండవచ్చుకాని
నీకులాగా సంఘసంస్కరణకి
సాహిత్యాన్ని సాధనంగా మలుచుకున్న వాళ్లు లేరు
కలాన్ని కత్తిగా వాడిన
కర్మవీరుడివి నువ్వు!

కంటకమయంగా ఉన్న లోకాన్ని
కళ్యాణమంటపంగా మలచిన
కవితా తపస్వివి నువ్వు!
నీపుట్టిన రోజున

నీ పేరు తలుచుకుని
జబ్బలు చరుచుకు కూర్చోవడంకన్న
నువ్వు చెప్పింది గ్రహించి
నువ్వు చెప్పినదారిలో గమించడమిన్న
అందుకే అందరిమాటా ఎలాఉన్నా
నాకు నే నీ హెచ్చరిక చేసుకుంటున్నాను.



"కందుకూరి వీరేశలింగం పంతులుగారి పుస్తకాలు నన్ను సంస్కార ప్రియుణ్ణి చేసినై"

—దరిశి చెంచయ్య, "నేను - నాదేశం"

# ఎవ్వరీతఁడు

**చేబోలు చిన్మయబ్రహ్మకవి**

ప్రాఁతతరాలనాటి పరిపాటిని దెల్పెడు కావిపంచెయున్
చేతులఁ దాఁకు కోటును విశిష్టమునౌ తలపాగఁ దాల్చి నీ.
పూతచరిత్రుఁ డెవ్వరొకొ? పొల్పగు మాటలకన్నఁ దీయనౌ
చేఁతలఁజేసి చూపెనఁటఁ చిత్తవిశుద్ధికి మాఱు సేరుగన్.

కాలము మారుచున్నది సుఖంపడు భావన మాఱుచున్నదీ
కాలములో సమాజ పరికల్పితశృంఖలలన్ బిగించి, చిం
తాలస చిత్తులౌట తగునా ? యని బోధయొనర్చి, జీవిత
శ్రీలకుఁ బ్రోదిచేసిన ఋషిప్రతిభుండితఁ డెవ్వరో కదా !

ప్రాఁత నమ్మకాలకు లొంగి నీతివిడిచి
స్వార్థపరత జీవించుట సర్థకంబ
టంచు హేతువాదమునఁ జూపించెనంట
క్రొత్తబాట, యీతం డెవ్వరో జగాన.

కూలిన జీవితాశ పటుఘోర కరాళ విషాదగీతికిన్
పాలొనరింప మ్రోడులయి భావిచరిత్రకు నీళులొగ్గి యం
దాలకు స్వస్తిచెప్పి కలఁతన్నడ పీనుఁగులై హతాశలౌ
బాలవితంతు దీనలకుఁ బర్వము దెచ్చిన యీతఁ డెవ్వరో.

నవయుగకర్తయై భువికి నవ్యవసంతము లెన్నొ తెచ్చి మా
నవతకు సంప్రదాయ పరిణామ మవశ్యమటంచుఁ దీర్చి చె

ప్ప్రవలఁతిఘ్నయై ప్రజావళికి బ్రహ్మ విధుండయి ప్రాఁత క్రొత్తలన్
జని పచరింపఁ జేసిన యశస్వి యితం డెవ రెవ్వరో కదా !

తన సేవావిధి, హిత కా
రిణీ సమాజంబొ యనఁగఁ బ్రీతిన్ బహుళాం
ధ్ర నిరతికై వెలయించిన
ఘనమతి వీరేశలింగ కవి యితఁ డగునా ?

పూనికతోఁ బ్రభుత్వము సమున్నతితోఁ దగ సత్కరింప నెం
తేని స్వదేశముం బొగడ నీసుదినంబున నూటపాతికేం
డ్లైన జయంతిలో స్వజనమంతయు భక్తిని గేలుమోడ్చఁగా
మౌనముఁ బూననౌనె ? కవిమండన ! సత్కృపలుల్లసిల్లఁగన్.

సరసమంజుల మంజరీతతి - చక్కఁగా వికసించె, సుం
దర రసాల సరాగపల్లవ - తండముల్ వెలుఁగొందె, మా
ధురులఁ జిందుచుఁ బాడెఁ గోకిల - తోఁటతోఁటి సుఖింపఁ జై
త్ర వసు పక్కి వరించె ససుమ్ముల - రాయఁ డాంధ్రులు మెచ్చఁగన్.



# ఆదర్శజీవి

చిలుకూరి రామచంద్రశాస్త్రి

శా. ప్రాయంబేబదిదాటఁ గంటివని - నీ నామానుకూలంబుగా
నీ యూసుస్థాశిని వాటి సభ్యవరులే నిన్నెంచి యా స్త్రీకులై
క్షేయంజౌ సభిస్వృద్ధిఁ జేసిరి - ఘనిస్ - చేయంగలారింక - సం
స్థాయుర్థాయను నీదు సూత్రరపనాస్థాయిన్ విజృంభింపెడిన్.

తే. గీ. జంగమంబగు నీరూపు స్వర్గమేఁగ
స్థావరాలగు నీసంస్థలే వసించి
నీదు మహిమల వెలను మన్నించుచుండ
అమృతమహిమనన్నగంబుగా నాత్మఁ దలఁతు.

సీ. ప్రైమర్క్య - దిన్కుసు లేక ప్రుకర్క-మన్క్య వలేని
అబలల శరణాలయాల దయయు
సద్గ్రంథ సౌగంధి సద్బంధులై నట్టి
గ్రంథాలయోద్గ్రంథ బంధసృష్టి
పారమార్థార్థి సత్ప్రార్థనావసథాప్త
భక్తి - ముక్తులగుండుఁ బట్టుగలయు
నిసుషులు సదుషుల వసులుగా వాసింప
హైస్కూలు - కాలేజులందు వాంఛ

తే. గీ. శివ్వె ! విన్నెన్ను కన్నుల నిచ్చె మాకు
నివ్వె ! ఆదర్శజీవిక నిచ్చె మాకు -
నివ్వె ! సత్యంబు - దయలఁ బామిచ్చె మాకు
కందుకూరి వీరేశలింగ ప్రధాని !

సాహిత్యరంగం చతికిలబడ్డది
స్తంభాలు విరిగిన మండపమైంది
మండుటెండలకు బీటలు వారగ
దండిగ వర్షం కురిపించాడు
మోడులుబారిన ఎడారి ద్రుమాలు
మోసులెత్తి యెగబ్రాకినాయి

గండుకోయిలల సంసిద్ధమైనాయి
మెండుగ 'కూహూ' నినాదాలు వినిపించాయి
మొగ్గలు విచ్చగ కుసుమమ్ములు
నిగ్గు సౌరభము వెదజల్లినాయి

ఝంకృతి నినాదాల సాహితీ షట్పదులు
మకరంద మాస్వాదించాయి
మూఢాచారాల ముసుగుల్లో
గాఢానురాగపు గుసగుసల్లో
తప్పటడుగులు వేస్తున్న సంఘం
గొప్పగ మీసాలు దువ్వుతున్నది.

సంస్కరణ బాణాన్ని సంధించి
సమయంలో వదిలాడు పంతులు
కొందరిపాలిట సమ్మోహనాస్త్రం
కొందరిపాలిట ఆగ్నేయాస్త్రం

సనాతనులు ప్రేల్చిన ఫిరంగి గుండ్లకు
సునాయాసంగా జూపాడు గుండెలు
స్థైర్యం అడ్డు గోడలై నిలిచాయి
ధైర్యం పెట్టని కోటలై వెలిశాయి -

బాలవితంతువుల సహారాహృదయాలకు
చాలినంత 'ఒయాసిస్' లభించింది

తెంపివేసిన పసికందుల కంఠాలకు
తుంపులు ముడివేసి సూత్రాలుకట్టించాడు

బ్రహ్మసమాజం, ఏకేశ్వరోపాసన
కర్మపరిపాకం - ఇంకేంకావాలి ?
విగ్రహారాధన నిషేధం
అనాగ్రహారాధనా పరిష్వంగం -
మహిళాసముద్ధరణకు
మహిమోపేతమైన తిరుమంత్రం
అజ్ఞానాంధకారాన్ని పారద్రోలే
సుజ్ఞానజ్యోతి విద్య అని చాటాడు
స్వజాతి ముసుగడ కోలమై
స్వకీయాభిప్రాయానుసారియై
తీరిక నెరగక యిసుమంత
ధారపోశాడు జీవితమంతా
దుయ్యబట్టింది సనాతనలోకం
వియ్యమొందింది అధునాతనలోకం
వెలివేసింది సంఘం
బలియిస్తానన్నాడు ప్రాణం
పేరులోగల వీరత్వం
పేరుకొన్న ఈశ్వరత్వం
స్థిరతరమైన లింగత్వం
ధర ముప్పిరిగొంట సత్యం
రావుబహద్దురు
వీరేశలింగం
పుత్రులులేక తప్పింది పున్నామనరకం
పుత్రికలు లేక అమరింది కన్యాదానఫలం
ఎందరో - మరెందరో బిడ్డలు
కందుకూరికి - మన కందుకూరికి
ఘన తపస్వి వీరేశలింగం
స్థిర యశస్వి వీరేశలింగం.

# నివాళి

ఖులుసు వేంకట రామమూర్తి

శా. బూజుల్ పట్టిన పాతపద్ధతుల తప్పుల్ కొన్ని వీడించి ని
ర్వ్యాజ స్థైర్యముతో నెదుర్కొని సమర్థంబైన ధీభారతిన్
తేజోవంతముగా నొనర్చితివ తృప్తిన్ సంఘసంస్కారముల్
భ్రాజిష్ణుండవు కందుకూరికవి దేవా! నీకు నూాయుంజలుల్.

నారీలోకము నుద్ధరింపంగను సంధానింపఁగా విద్యలన్
సార ప్రక్రియ మీర పూరుషులతో సాధించి స్త్రీహక్కులన్
కారుణ్యంబున నిల్పినాఁడవు జగత్కల్యాణ కాంక్షారతిన్
వీరత్వంబున రాణకెక్కితివి శ్రీ వీరేశలింగాగ్రణీ!

రాజితకీర్తిమూర్తి అపరాజిత వాఙ్మయమూర్తి తాను ని
ర్వ్యాజ మహాకృతుల్ భువిని రాశిలఁ జేసియు సంఘమందు ను
త్తేజము కల్గఁజేసి జగతిన్ కడు శోభనుగూర్చి భాసిలెన్
రాజిత రాణ్మహేంద్ర నగరంబున కీర్తిపతాక మెత్తుచున్.

పతితంబై చ్యుతమైన సంఘమునకశోభన్గూర్చి రక్షింపఁగా
పతికిన్ బాసటగాఁగ నిల్చి విమల ప్రాచుర్య సందేశముల్
వెతలన్ బాపక స్త్రీసమాజములలో వేమారు బోధించి శా
శ్వత సత్కీర్తిని గాంచినావు భువిమెచ్చన్ రాజ్యలక్ష్మీశ్వరా!

క్షితిలోనన్ సుగుణాలవాల గుణరాశిన్ రాజ్యలక్ష్మీశ్వరిన్
సతిగాఁ బొందిన నీవు ధన్యుఁడవు నీసాహిత్య సౌహిత్య శా
శ్వత భాషామయ సేవలెల్ల సఫలన్ సంధించె నభ్యున్నతిన్
వితతోత్సాహము మెచ్చె నీకు జగతిన్ వీరేశలింగాగ్రణీ!

అగణితమైన దీక్షను మహత్తర సేవల నెన్నొ చేయగా
సుగమము మీర సాయపడె సొంపుగ నీ సతి రాజ్యలక్ష్మియాం పె
పత్నిగఁగొని దేశ దేశముల గీర్తినిఁ జెంద భవద్యశోలతల్
యుగ పురుషుండవైతివి మహోదయ! నీకు నమస్సుమాంజలుల్.



"ఈ నెల 11 వ తేదీన చెన్నపురి నివాసులగు కంద గెడ్డల శేషాచెలశెట్టిగారి వితంతు కుమార్తెకును, విశాఖపట్టణ కాపురస్థులగు నొక గొప్ప వర్తకుని కుమారుడగు శ్రీ గరుడా హనుమంతరావునకును వివాహము బెంగుళూరులో మ. రా. శ్రీ. రావు బహదర్ కందుకూరి వీరేశలింగం గారు హిందూశాస్త్ర ప్రకారము జరిపించిరి".

—ధర్మ సాధని సం. 1, సం. 13 1914 జూలై 1.

# జోహారు

సత్యవాడ ఇందిరాదేవి

వీరేశలింగమా! విప్లవవిస్ఫులింగమా! నమోవాకాలు నీకు
మాగుండెచించి ఎగసినకృతజ్ఞతాభివందనాలు నీకు.
ఆంధ్రదేశపు కడుపు పండిన పంటవు
అబలల కన్నీటిధారల కానకట్టవైనావు
ఛాందసాచారములపాలి వజ్రాయుధము నీవు
భావాంధకారమున మునిగిన తెలుగులకు సూర్యదేవుడవైనావు
ఖండాంతరముల నీకీర్తి వైజయంతిక లెగిరె
ప్రతిపక్షవాదాలు దూదిపింజలై ఎగిరె
ఒకరకము కృషికాదు ఒకరకము శ్రమకాదు
ఒక మహోద్యమమెకాదు
నీనిరంతరశ్రమ తెలుగుబ్రతుకులో నందనాలు విరియించింది
నేడు నీ ఆశయాలకు పట్టిన అవస్థచూసి పన్నీటిజల్లులు కురిపించింది.
ఎంత అలమటిస్తున్నావో స్వర్గంలోనించీ
ఏరీ వెయ్యికొక్కరు కన్పిస్తున్నారా నీకు
వితంతువును నిస్వార్థంగా చేపట్టేవాళ్ళు?
జరిగిన కృషికంటే జరగవలసిన కృషి ఎక్కువని ఆరాటపడేవాళ్ళు?
ఏదో ఇంతచదువుమటుకు చదువుకుంటున్నారు
నీలాంటి దయామయులపుణ్యమాని ఆడపిల్లలు
కానీ సల్లక్షణాలన్నీవున్న కన్యకే కట్నం ఇవ్వందే కావట్లేదు పెళ్ళి

# నమస్సుమనస్సులు

కరెముజ్జి ఎజ్జనకవి

రాజితకీర్తిశాలియగు రాజమహేంద్రుని పట్టణమ్ములో
తేజము మీఱ నవల్లికల తెల్గుల వెల్గులు నింప నొప్పుగా
పూజితకీర్త నీయ! కవిపుంగవ! జన్మమునందినావు వి
భ్రాజిత సద్గుణమ్ముల ధరాస్థలి వెల్గిన వద్దిరా కృతీ!

తెలుగుంబాసను తీరుతెన్నులను శుద్ధిసేయగా జేసి, ని
ర్మల పాత్రమ్ములు వ్రాసి, స్త్రీలోకసర్వప్రాభవౌన్నత్య మం
జులతాదోహదశక్తిగూర్చితివి యుష్మత్ పద్ధతుల్ పల్కంగ నీ
విలసత్ ప్రేమకు నా నమస్సులివె శ్రీ వీరేశలింగా కృతీ!

సంఘ సంస్కర్తవై ప్రశాంతియుగమును
సృష్టిగావించినావు విశిష్ట సుగుణ
గణ్య! శ్రీ కందుకూరి సుగణ్య వంశ
శ్రీశ! వెల్గుము శ్రీ వీరేశలింగ సుకవి!

అగుత నీ నాటువుగ సత్రయెడు పత్ర
రముల బరగు జయంతిని రమ్యమైన
మంగళము ; యుగంధరత్రైపై మనుజులకును
మంగళముగాత ; వీరేశలింగ సుకవి!



# నవయుగ వైతాళికుడు

## కొవ్వూరి నాగిరెడ్డి

"శ్రీ వీరేశలింగముపంతులుగారు నిశ్చయముగా మహాపురుషులు. సాహిత్యములో ఒకశాఖను ప్రారంభించి, సంఘములో పురోభివృద్ధి పంథా లేవదీసినారు. ఇది ఎంతో కష్టతరమైనపని. తెలుగుదేశపు సేనాధిపతులైన వంశపురుషుల రక్తము తమలో ప్రవహించుచున్నది కనుకనే వారిలో సాహసము, నిశ్చలత్వము కనబడతవి". ఈమాటలు శ్రీ గురజాడ అప్పారావుగారు 1911వ సంవత్సరం 12 వ తేదీన దినచర్యలో వ్రాసికొనిరి. 8 సంవత్సరములకు ఇక వీరేశలింగముగారు లింగైక్యము పొందనుండగ, జీవించిన వీరేశలింగమునకు గురజాడవారి ఈ మెచ్చుకోలు అచ్చమైనది.

శ్రీ గురజాడవారన్నట్లు శ్రీ వీరేశలింగము ఒక సేనాధిపతి వంటివారు కానిచో, ఆ మహా కార్యక్రమములు, ఒడిదుడుకులు, వెరపులు, వెనుకబాటులులేని చొరబాటుతనమువలన చేసిన సంఘ సంస్కరణములు జరిగియుండెడివా?

సృష్టియనునది ఒక మహాప్రవాహము. ఈ మహా ప్రవాహమున కోట్లానుకోట్లమంది మానవులు కొట్టుకొని పోవుచున్నారు. కొంద రెదురీదియు లక్ష్యపుటొడ్డునకు చేరగలుగుచున్నారు. అట్టివారిలో భారతదేశములో చెప్పుకొనదగిన వారిలో రాజారామమోహనరాయలు తరువాత ముఖ్యులు శ్రీ కందుకూరి వీరేశలింగముపంతులుగారు.

సంఘసేవా రంగమున, సాహిత్య రంగమున సింగమువలె విజృంభించినారు. ఒకరకమైన త్రుప్పు వదల్చినాడు. ఇది మేలిత్రోవయని చెప్పినాడు. హృదయజన్యమైన ప్రబోధ పాంచజన్యముతో తెలుగుజాతిని సర్వరంగములందును మేలుకొలిపినాడు. అందువలన పంతులుగారు 'నవయుగవైతాళికులు' అయిరి.

### విద్యార్థులకు వైతాళికుడు శ్రీ వీరేశలింగం:

పాఠశాలా విద్యార్థిగ నున్నప్పుడు శ్రీ వీరేశలింగం, ఉపాధ్యాయుడుకదా అని తప్పుచెప్పిన ఒప్పుకొనెడివాడుకాడు. అట్టి సందర్భములందు గురువు నెదిరించవచ్చుని విద్యార్థులకు చెప్పెడివాడు. సత్యాన్వేషణము ధ్యేయముగాగల విద్యార్థులకిరీతిగ వైతాళికుడయ్యెను.

### స్త్రీజన వైతాళికుడు:

బాల్యవివాహములవలన ముక్కుపచ్చలారని బిడ్డలభవిష్యత్తు అంధకారబంధురమగునని గ్రహించినాడు. వెట్ కూడదనినాడు. రచనలచే చేతలచే ఆపినాడు. 1881 వ సంవత్సరమున డిశంబర్ 11 వ తేదీన రాజమహేంద్రవరమున పంతులుగారు ప్రథమ

ముగ సీతమ్మకు - శ్రీరాములకు వితంతు వివాహము జరిపించినారు. అదే సంవత్సరము డిశంబర్ 15 వ తేదీన పంతులుగారు స్త్రీ పునర్వివాహము జరిపించినారు. అది రామచంద్రరావు రత్నమ్మలకు చేయబడినది.

1882 అక్టోబరు నెలలో మూడవస్త్రీ పునర్వివాహము జరిపించినారు.

1881 నుండి వీరేశలింగముగారి భవ్యదృష్టి స్త్రీ జన బాధలను చూడసాగినది. అది క్రమముగ పెరిగినది.

1883 లో కందుకూరి వారు ముఖ్యముగ స్త్రీలకై 'సతీహితబోధిని' యను మాసపత్రికను ప్రారంభించిరి.

పురుషులపునర్వివాహములవలె స్త్రీల పునర్వివాహములు జరుగవలెనని అది శాస్త్రవిరుద్ధము కాదని పంతులుగారి వాదన ఆయన అసలైన న్యాయవాది.

1884 జూన్ 22 న స్త్రీ పునర్వివాహ సమాజమును స్థాపించినారు. 1886 లో మార్చినెలలో రాజమహేంద్రవర పుర పారిశుధ్యవిచారణ సంఘమున సభ్యులైన, రాజమండ్రికి ఆరోగ్యదాయికమైన కృషిచేసియున్నారు.

1897-98 ప్రాంతమున శ్రీ వీరేశలింగముగారు చెన్నపట్టణమున తమ స్వగృహమునందే వితంతు శరణాలయమును స్థాపించిరి. నేడు అనేకములైన సమాజములు స్థాపించుట మనముచూచుచున్నాము. వెంబడినే అవి భూస్థాపితములగుట మనకనులతోడనే చూచుచున్నాము. శ్రీ వీరేశలింగముగారు పట్టిన పట్టు వీడనివారు. చెడుపట్ల ఆయనకు మాచెడ్డ ద్వేషముండెడిది - వారు స్వీయచరిత్రలో " ఒరులు చెడుపనిని చేసినప్పుడు నాకు కోపమాగదు. నేనప్పుడు పరుషభాషణములు సహితము పలుకుదును" ఇది వారి తీవ్రభావమును తెలుపుడుచేయుచున్నది.

చెప్పుటలు - చేతలు దీనినడుమ వీరేశలింగముగారికి దూరము, కాలము ఎక్కువ ఉండెడిదికాదు. ఆవిషయమై ఆయన స్వీయచరిత్రమున -

" నాకొక యభిప్రాయము పుట్టుటకును, దానిని నెఱవేర్పబూనుటకును నడుమ తడవు విశేషముగ నుండదు " అని వ్రాసికొనిరి.

" నేను సాధారణముగ శాంతస్వభావముగలవాడనే అయినను న్యాయవిషయమున నాకాగ్రహకారణము గలిగినప్పుడు నా యుద్రేకమునకును పట్టుదలకును పరిమితియుండదు " అనికూడ వ్రాసుకొనిరి. ఇటువంటి గుండె దిటవుగల వ్యక్తికాక మరొక్కరాయన నిర్వహించిన కార్యకలాపములు నిర్వహించగలరా ? సంఘమున జరుగుచున్న అవినీతికి కారకులయినవారిని ఎదిరించుటలో అనాడు శ్రీ వీరేశలింగముగారి విధానము ప్రశంసనీయము హితకారిణిసమాజము మున్నగునవి స్థాపించి, రూపకల్పనజేసి జీవింపజేసిన శ్రీ కందుకూరివీరేశలింగముగారు స్త్రీజనమునకు వైతాళికుడయినారు

పత్రికారచయితలకు వైతాళికుడు :

జరుగుచున్నవి జరుగనట్లు, జరుగనివి జరుగుచున్నట్లు వ్రాయు పత్రికారచయితలు కొందరుందురు. రకరకములయిన ప్రలోభములకు తలఒగ్గి ఆశయ విరుద్ధములను బలపరచుట కొంతమంది పత్రికారచయితల విషయమున మనము చూచుచునేయున్నాముగదా ! అట్టుకానిపత్రికారచయితలకు వైతాళికుడయినవాడు మనవీరేశలింగము. అవినీతి, ఆశ్రితపక్షపాతము మున్నగువానికి పాల్పడినవారిని పేరులతోపాటు బయటకు లాగుకురావలెను. వారి తప్పులు చక్కదిద్దబడవలెను. ఈవిషయమున శ్రీ

వీరేశలింగముగారు వివేకవర్ధని మున్నగు మాస పత్రికల మూలమునచేసిన సేవ యపారము.

సత్యదూత, వృత్తాంతిని, వర్తమానతరంగిణి, సంవాద కౌముది, గోదావరి విద్యాప్రబోధిని మున్నగు సుమారు 20 పత్రికలపైన వీరేశలింగముగారి వివేకవర్ధని పత్రిక వచ్చునాటికి వుద్భవించి యుండెను.

అయినను సంఘమున ప్రజల వివేకమును ప్రవర్ధమానము జేసినది ముఖ్యముగ పంతులుగారి వివేకవర్ధనియే. తమ అభిప్రాయములను ప్రజలకు తరచు వివరించుటకు ఒక వృత్తాంత పత్రిక అవసరమని తాను భావించి వివేకవర్ధని ప్రారంభించినట్లు వారు తమ స్వీయచరిత్రమున వ్రాసికొనిరి.

చరిత్రకారులకు వైతాళికుడు :

మాకవులు ఇంత గొప్పవారు అంతగొప్పవారు అని చెప్పుకొనుటకాక, వారి కృషి విశేషములివాడు గ్రంథములందు మనము గాంచుచుంటిమనగ కందుకూరివారే కారకులు. వారి ఆంధ్రకవుల చరిత్ర. కొన్ని అంశములందానాటికిచరిత్రకారులుగ నున్నవారికి కనువిప్పు కలుగజేసెను తన యంశములు సరికానివనుకొన్న పిదప తెలిసినపుడు శ్రీ వీరేశలింగము ద్వితీయముద్రణమున సవరించిరే కాని తనవాదము బలపరచుకొనుటకు లేనిపోని సిద్ధాంతము లేవనెత్తలేదు. రాద్ధాంతము చేయలేదు. ఆంగ్లేయులందు గొప్పవారైన నారీమణుల చరిత్రవంటి రచనలు ఎన్నోచేసినారు.

తొలివచన,ప్రబంధనిర్మాత అయినాడు ఆంగ్లానుసరణలున్నను దేశీయసమస్యలకు పరిష్కారసూచనలును, మూఢాచారుల విషయమున ఎత్తిపొడుచుటలును ఆయన రచనలందు చోటుచేసికొనినవి - శ్రీ చిలకమర్తివారు వీరేశలింగ ఆశయధారులైరి ఈవిధముగ పంతులుగారు రచయితలకు వైతాళికుడయినారు.

చక్రవర్తి రాజగోపాలాచార్యులవారు వీరేశలింగము గూర్చి - వ్రాయుచు

"శ్రీ వీరేశలింగ ముండియుండని యెడల ఆయన ప్రభావితము చేయనియెడల ఆంధ్రదేశీయులు ప్రస్తుతస్థితి యందుండెడివారు కారు. ఆంధ్రదేశము ఆయనను చూచి గర్వించవచ్చును. అవిధముగనే ఆయన సేవలెరిగిన దక్షిణభారతమును గర్వించవచ్చును (1843)

"దేశావృతమైన సంస్కార పరివర్తనమునకు శ్రీయుత వీరేశలింగము పంతులుగారి జీవిత చరిత్రము ప్రమాణముగనున్నది" అని కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారనిరి.

శ్రీ మధునాపంతుల సత్యనారాయణ శాస్త్రి తమ వీరేశలింగోదాహరణ కావ్యమున వ్రాసినట్లు

" ఒకటికావెన్నెన్నొ ఉదయించి పెంపొందె
సకలమ్ము వీరేశ సాహిత్య ఖనియందె "

ఆ సాహిత్య ఖని. సాంఘిక విజ్ఞాని, పత్రికాసంపాదకునిగ రచయితగ, కవిగ, అనువాదకునిగ, చరిత్రకారునిగ సమాజములస్థాపకునిగ, ఆంధ్రమున మొదటి పురమందిర స్థాపకునిగ, బాల్యవివాహాది దురాచారములను వ్రేళ్ళతో పెకల్చిన వీరుడైన సంఘసంస్కర్తగ భారతజాతి చరిత్రలో భద్రస్థానమేర్పడిన శ్రీ వీరేశలింగమునకు మనము ఋణపడియున్నాము. ఆయన ఆశయములను నెరవేర్చుచు ఆయన సంస్థలు సరిగనడుపుచు ఆయనకు ఆత్మశాంతి కలుగజేయుదుముగాక !

ఆయన ఆంధ్రదేశమునకు నవయుగ వైతాళికుడు. ఆయనసూక్తులు మనకెప్పుడును మేలుకొలుపులగుచుండునుగాక !



# నవ్యాంధ్ర నిర్మాత

క. విశాలాక్షమ్మ

మ. కవితాకన్యక ! జన్మభూమియగు నీ గ్రామంబులో నెన్ మహా
కవియౌ నైషధగ్రంథకర్త వెనుకన్ ఖ్యాతిన్ బ్రకాశించు స
త్కవివర్యుండితఁడో [illegible] కవియై కందుకూరి వీరేశలిం
గ విభున్ సన్నుతిఁజేయశక్యమగునే భూమండలంబందునన్.

చ. కవులచరిత్ర వ్రాయ నెవఁగల్గిన యుక్తి శ్రమమున గణింపకే
కవియగు కందుకూరి కులకీర్తి పవిత్రుఁడు వ్రాయ నెందఱో
కవులకు పుస్తకంబొసఁగి కల్పకమట్టి [illegible]
ప్రవిమలమై ప్రశంసలకుఁ బాత్రమయయ్యె ధరాతలంబునన్.

శా. ధీరోదారుఁడు కందుకూరికులవర్ధిష్ణుండు శాంతుండయో
కారుణ్యంబుగలట్టి మాన్యుఁడగుటన్ కష్టంబులన్ సైచుచున్
ప్రారంభించిన భవ్యకార్యవితతిన్ బ్రజ్ఞానమేతంబుగా
సారంబేర్పడఁజేసి రావుబహాదుర్ సామాన్యుఁడెట్లయ్యెడున్.

చ. శతమును మించి గ్రంథములు సల్పి మహామహుఁడై జగజ్జన
స్తుతుఁడయి కందుకూరి కులపావనుఁ డొనర్చె మహోపకారముల్
చతురిమ సంఘసంస్కరణసల్పిన మాన్యుని దానసాహసున్
స్తుతి నొనరించి భక్తిమెయి జోహారులం బొనరింతు నెప్పుడున్.

క. భూరి గుణోధనులగు శ్రీ
వారి శిలావిగ్రహంబు పట్టణమునఁ బో
ల్పారునది కాంచు వారా
గౌరవనీయు వినుతిఁ బ్రకటము కీర్తిమెయిన్.

చ. శతమును నైదునిర్వదగు జన్మదినోత్సవ మివిధంబుగా
నతిరమణీయమౌనట మహోయనులిచ్చట సల్పిరిప్పు డం
చితుడగు కందుకూరికిని జేసిన సేవ ప్రశంసనీయమౌ
సతతము వారికీశ్వరుడొసంగునుగాక చిరాయురున్నతుల్.

క. శ్రీ రాజ్యలక్ష్మియనియెడు
నారీమణినాథుడై యొనర్చె సతితో
వీరేశలింగ మనితో
దారుండై సంఘసేవ తత్పరమతియై.

తే. వారు నిర్మించు బాలికా పాఠశాలయందు చిన్ననాడు చదివినందువలన
దరచు కాంచితి నా పుణ్యదంపతులను వారలకొసర్తు భక్తిజోహారులెపుడు.

క. వీరేశలింగకవివరు నారంభమున దీనియందు నతివేడ్క మహో
దారులు కవిసమ్మేళన మారయ నొనరించుచుండ్రి హర్షంబలరన్.



"గ్రంథస్వీకారము -

కవుల చరిత్రమును సంస్కరించి తిరిగి ముద్రించుటను శ్రీ. రా. బ. కం. వీ. గారు పూనుకొని యున్నారు. మొదటి భాగము సిద్ధమయి ప్రచురింపబడినది.

అది 680 పుటలు గల యొక ప్రత్యేక సంపుటముగ తయారైనది. రెండవ భాగము కూడ త్వరలోనే ప్రకటింప నుద్యుక్తులై యున్నారు. వారికి ఈశ్వరుడు సాయపడుగాక.

ధర్మసాధని సం. 5, సంచిక 3 1918 ఫిబ్రవరి 1."

# ఒక్క మనిషి

హేమలతా లవణం

ఎక్కడమ్మా ఓ గోదావరి
ఒక్క మనిషి ఆ కందుకూరి

వగల పొగల
నిండిన సెగల
ఎండి వాడిన
ఎడారి బ్రతుకుల
కురిసిన తొలకరి
విరిసిన నవజీవని
ఒక్క మనిషి ఆ కందుకూరి —

కల్యాణ మండపం
వాయిద్య డంబరం
ఆనందార్ణవం
పురోహితుల మంత్రం
విన్నాం అందరం
పంచుకొన్నాం సంబరం

సంబరానికి దూరం
సంఘానికి భారం
కన్నమ్మకు ఆరాటం
నలిగిన లేత జీవితం
అంపిన అతిథిపవనం
మోసి తెచ్చిన ఆవేదనం
విన్నది మాత్రం
ఒక్క మనిషి —

సగాన నిలిపిన వాక్యం
ఈనాటి యీ జన్మదినం
కాదు సిరి పీరేశం
ఇది మాదు వీర-వేశం
ఇదే మా ఉద్యమ ధ్యేయం

ఓ గోదావరీ
ఓ కందుకూరి

చేస్తున్నాం మనసు కుదిరి
గోదావరికి పుష్కరం
కందుకూరికి నమస్కారం
ఋణం తీరిందని ఊరుకుంటాం
పన్నెండుదాకా నోళ్ళు ముడుచుకుంటాం

అందుకే ఇంత దుర్భిక్షం
ఇందుకే అంతా దుర్వ్యయం
ఆగని అన్యాయం
ఆరిపోని అక్రమం —

వేయాలి మానవతల
మార్పు లతలు
పూయాలి మా హృదయాల
మానవతలు
కావాలి ప్రతి ఒక్కరం
అసలు మనుషులం

న్యాయం త్యాగం
సాయం సాహసం
నిండిన వీరేశులం

*

# సేవాధనుడు

గోవిందరాజు రామకృష్ణరావు

"తనదేహము, తనగేహము
తన కాలము, తన ధనంబు, తనవిద్య జగ
జ్జనులకు వినియోగించిన
ఘనుఁడే వీరేశలింగకవిజనులారా!"

దేశసేవకోసం, సంఘసముద్ధరణకోసం సర్వస్వాన్ని అంకితంచేసిన త్యాగధనుడు, మహామనీషి కందుకూరి వీరేశలింగంపంతులు. ధనసంపదగానీ, అధికారప్రాబల్యంగాని లేకపోయినప్పటికి అకుంఠిత దీక్షే సాధనంగా ఆశయాన్ని సాఫల్యం చేసుకున్న కార్యశూరుడాయన. సాంఘిక దురాచారాలను రూపుమాపి తెలుగునాట నవోదయాన్ని చైతన్య స్ఫూర్తిని, సంస్కరణామరశక్తిని వెలయింపచేసిన యుగకర్త కందుకూరి.

పవిత్రగోదావరీతీరాన రాజమహేంద్రవరంలో 1848 ఏప్రిల్ 16న జన్మించారీయన. పున్నమ్మ, సుబ్బారాయుడు పుణ్యదంపతులకు ఏకైకపుత్రుడు. ఈయనకు పితామహుడైన వీరేశలింగం పేరు పెట్టారు. తాతగారి జన్మస్థలం ఏలూరు. స్వగ్రామం వదిలి ఆయన రాజమహేంద్రవరంలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు.

పుట్టినప్పటినుంచి ఆరోగ్యం సరిగా వుండేది కాదు. పురిటిలోవుండగా ఒక రోజంతా కాళ్ళూ చేతులూ కదపకపోవడంతో అంతా ఆశవదులుకున్నారు. ఆరునెలల ప్రాయమప్పుడీయనకు మశూచిసోకింది. ఐదేళ్ళప్పుడొకసారి ప్రమాదవశాత్తు గోదావరిలో పడ్డారీయన. పెద్దవాడై మహత్తరసేవ చేయవలసి వుండడంచేత అన్నింటిని జయించి ముందుకు వచ్చాడు.

వీరేశలింగంగారికి నాలుగు సంవత్సరాలు నిండక ముందే తండ్రి మరణించారు. పిల్లలులేని పెదతండ్రి వెంకటరత్నం ఈయనను పెంచి పెద్దచేశాడు. బాల్యంలోనే వీరేశలింగం ఆంగ్లం,గణితం మాత్రమే కాక సంస్కృతాంధ్రాలలో కూడ అనన్యమైన పాండిత్యాన్ని సంపాదించారు. పాఠశాలలోని ఉపాధ్యాయులీయన ప్రజ్ఞావిశేషాలను, సాధువర్తనను చూసి ఆశ్చర్యపోయేవారు. ఎన్నెన్నో ఉత్తమాశయాలు బాల్యంలోనే అంకురించాయి వీరేశలింగం గారికి.

మూఢనమ్మకాలంటే యీయనకు చిన్ననాటి నుంచి సుతరామూ గిట్టేదికాదు. దయ్యాలు సంచరిస్తూ వుంటాయని అందరూ భయపడే శ్మశానానికి రాత్రిపూట ఒంటరిగా వెళ్ళి దయ్యాలు కేవలం భ్రాంతి అని నిరూపించేవారీయన. మాంత్రికులు, భూతవైద్యులు ఈయనచేతుల్లో అనేకసార్లు పరాభవం చెందారు.

బాల్యంలోనే ఈయనకు బ్రహ్మసమాజ సిద్ధాంతాలపట్ల గాఢవిశ్వాసం ఏర్పడింది. సద్వర్తన, ఏకేశ్వరోపాసన, విద్యావ్యాప్తి, దురాచార నిర్మూలన, సత్యాహింసలపట్ల గౌరవం మొదలైన బ్రహ్మసమాజాశయాలను క్షుణ్ణంగా అవగాహన చేసుకున్నారు. సంస్కరణకై తపించే ఈయన హృదయం వీటినిగ్రహించి మరింతబలంగా స్పందనం ప్రారంభించింది. రాజా రామోహన్ రాయ్, కేశవ చంద్రసేన్‌వంటి మహాపురుషుల గ్రంథాలను బాగా అధ్యయనంచేశారు

విద్యార్థిగావుండగానే ఒక సమాజాన్ని స్థాపించి భావిజీవితోద్యమానికి నాంది పలికారు. అతిబాల్య వివాహాల కాలం కావడంచేత పదమూడేళ్ళ వయస్సులోనే ఈయనకు వివాహమయింది. వధువు రాజ్యలక్ష్మమ్మ.

చిన్నతనంనుంచి ఎంతో అనురాగంతో పెంచిన పెదతండ్రి వెంకటరత్నం మరణించేటప్పటికి వీరేశలింగం వయస్సు పందొమ్మిది సంవత్సరాలు. అంతటితో విద్యాభ్యాసానికి అంతరాయం ఏర్పడింది. కుటుంబపోషణభారం వహించవలసి వచ్చింది తనపైన అభిమానంగల మారిస్‌దొర 'శిరస్తాదార్' ఉద్యోగం ఇస్తానని చెప్పినప్పటికీ, ఉపాధ్యాయ వృత్తిద్వారా దేశసేవ చేయడానికి, తనలో పెల్లుబుకుతున్న సంస్కరణాశయాలకు కార్యరూపమివ్వడానికి ఎక్కువ అవకాశముంటుందని ఆ వృత్తినే స్వీకరించాలని నిశ్చయించుకున్నారు.

1872 లో కోరంగి అనే గ్రామంలో ఇంగ్లీషు పాఠశాలలో ప్రధానోపాధ్యాయుడుగా చేరారు. నెలపరివేతనం ముప్పై రూపాయలు.

పంధొమ్మిదో శతాబ్దం ఉత్తరార్థమందు దాస్యబంధంలో క్రుంగుతున్న దేశంలోని పరిస్థితులు అధ్వాన్నంగా వున్నాయి. తెలుగునాడు సాంఘికంగా మరీనికృష్ట స్థితిలో వున్నది. దురాచారాలు విచ్చలవిడిగా సాగుతున్నాయి పైగా నాటి పండిత పామరులు అవన్నీ సదాచారాలని నమ్ముతున్నారు. మూఢనమ్మకాలకు అంతులేదు. కులమత తత్వాలు వెర్రితలలు వేశాయి. పాలకవర్గాలలో అవినీతి లంచగొండితనం స్వైరవిహారం చేస్తున్నాయి. విద్యాభ్యాసానికి అవకాశాలు తక్కువ. విద్యాధికులైన కొద్దిమంది జీవనోపాధికోసం తాపత్రయ పడుతున్నారు. వారిదృష్టి సంఘంవైపు ప్రసరించేది కాదు. విదేశీప్రభుత్వానికి సంఘశ్రేయస్సుతో పనేముంటుంది? త్రాగుడు, జూదం మొదలైనవి మితిమీరి సాగుతున్నాయి. దయ్యాలు, భూతాలు పేరుతో భూతవైద్యులు ప్రజలను పీల్చి పిప్పిచేస్తున్నారు. అరవై, డెబ్బై సంవత్సరాలు దాటిన పురుషులు రెండోపెళ్ళో, మూడోపెళ్ళో, నాలుగోపెళ్ళో చేసుకోవడానికి ఉబలాట పడుతున్నారు. వారకాంతలకు నాటి సంఘంలో ప్రముఖస్థానం వున్నది సానిమేళాలకు ఎనలేని ఆదరపోషణాలు లభిస్తున్నాయి యువతీలోకం పరిస్థితి హీనాతిహీనంగావుంది. స్త్రీవిద్యకు ఎట్టి ప్రోత్సాహమూ లేదు. ముక్కుపచ్చలారని పసిపాపలకు వివాహాలు చేసేవారు కన్యాశుల్కాలు తీసుకుని పదిపన్నెండేళ్ళ బాలికలను కాటికికాళ్ళుచాచిన వృద్ధులకిచ్చి పెళ్ళి చేస్తున్నారు ప్రతియింటా బాల వితంతువుల దీనాలాపాలు వినవస్తున్నాయి స్త్రీలకు అడుగడుగునా రకరకాల సంకెళ్ళు తగిలిస్తున్నారు.

ఇటువంటి దీనస్థితిలో క్రుంగుతున్న సంఘాన్ని చూసి వీరేశలింగం సంస్కారహృదయం వేదనాభరితమైంది తనరచనా పాటవాన్ని, శక్తిప్రోమతలను జీవిత సర్వస్వాన్ని సంఘ సముద్ధరణకోసం అంకితం చేయడానికి కృతనిశ్చయులయ్యారీయన.

ముఖ్యంగా స్త్రీజనోద్ధరణకై, పాటి అభ్యున్నతికై వీరేశలింగం చేసినంత కృషి దేశచరిత్రలోనే

మరొకరు చేయలేదనడం అతిశయోక్తి కాదు. తదితర జీవనరంగాలలో కూడ ఈయన సేవ సామాన్యమైనదేమీ కాదు. సంస్కరణ అన్నది ఒక విధంగా తిరుగుబాటు వంటిది. దానికి ఎంతో సహనం, సాహసం అవసరం. ఎన్నో అవరోధాలు ఎదురవుతాయి. ఎందరో ప్రతిఘటిస్తారు. పంతులుగారన్నట్లు 'లంచములు తగవన్న రాజకీయోద్యోగులకు కోపము; వేశ్యాంగనా సంగము నీతి గాదన్న శృంగార నాయకులకు కోపము, పూర్వాచారమును మార్చుకోవలెనన్న పామరజనులకు కోపము; నీతి మాలిన బాహ్యాపేషములు మత విరుద్ధములన్న ఆచారపురుషులకు కోపము.

సంఘ సంస్కరణ రంగంలో వీరేశలింగం పేరు చెప్పినప్పుడు వెంటనే తలపుకొచ్చేది స్త్రీ పునర్వివాహం. ఈ ఉద్యమానికి స్రష్ట, నేత పంతులుగారే. యుక్తవయస్సు కూడా రాని బంగారు బొమ్మలవంటి బాలికలు వితంతువులై వారి జీవితం మోడు వారిపోవడం, కురులు తీయించి నగలు లాగివేసి ఇంట్లో ఒక మూల వారిని అమంగళ స్వరూపాలుగా కూర్చోపెట్టడం వీరేశలింగం సహించలేకపోయారు. వారి జీవనలతను తిరిగి పల్లవింపచేయాలని దృఢ సంకల్పులయ్యారు.

సనాతనవాదుల వ్యతిరేక ప్రచారాన్ని ఎదుర్కోవటం పంతులుగారికి ప్రధాన సమస్యగా పరిణమించింది. కొక్కొండ వెంకటరత్నం పంతులుగారి 'ఆంధ్రభాషా సంజీవని' సనాతన వాదులకు ప్రబలమైన వేదికగా ఉపకరిస్తోంది. 'గోదావరి విద్యాప్రబోధిని'లోను, 'పురుషార్థప్రదాయిని'లోను వీరేశలింగం విమర్శనాత్మక రచనలు చేస్తూవున్నప్పటికి సనాతన వాదుల వ్యతిరేకోద్యమాన్ని ప్రతిఘటించడానికి, తన ఉద్యమాన్ని మరింత శక్తిమంతంగా ప్రచారంచేయడానికి వీలుగా 1874 లో ఈయన 'వివేకవర్ధని' అనే మాసపత్రికను నెలకొల్పారు.

ఆ సంవత్సరమే ఈయన కోరంగి వదలిపెట్టి ధవళేశ్వరంలో ప్రధానోపాధ్యాయ పదవి స్వీకరించారు. స్త్రీ విద్యావ్యాప్తి, స్త్రీ జనోద్ధరణ, భాషాభివృద్ధి, దేశాభివృద్ధి మున్నగు ఆశయాల సాధనకీ పత్రిక బాసటగా వున్నది.

వితంతు వివాహసమస్యపై చర్చించే నిమిత్తం ఈయన మనుస్మృతి, యాజ్ఞవల్క్య స్మృతి, పరాశరస్మృతి మొదలగు ముఖ్య స్మృతులు, పురాణేతిహాసాలు, మహాపండితుల గ్రంథాలు మున్నగు వాటినిక్షుణ్ణంగా చదివారు. 1879 ఆగష్టు 3వ తేదీన విజయనగరం మహారాజ బాలికా పాఠశాలలో ఒక సభ ఏర్పాటుచేశారు. ఆ సభలో పంతులుగారు స్త్రీ పునర్వివాహంపై ప్రసంగవ్యాసం ఒకటి చదివి వినిపించారు. అందుమీదట అనేక మంది పండితులు ఈయనను తీవ్రంగా దూషించారు. అంతలో ఆగక ఈ ఉద్యమవ్యతిరేకులైన విధాయక వాదులు దంతులూరి నారాయణ గజపతిరాజు, శ్రౌతము కోటేశ్వరశాస్త్రులు, భువనగిరి పరదేశి సోమయాజులు, కొక్కొండ వెంకటరత్నం, వేదం వెంకటరాయశాస్త్రులు, దాసు శ్రీరాములు ప్రభృతుల చేత ఖండన గ్రంథాలు వ్రాయించారు. వీటన్నింటికి పంతులుగారు ప్రమాణయుతంగా ప్రత్యుత్తరాలు వివేకవర్ధనిలో ప్రచురించారు. అనేకచోట్ల ఉపన్యాసాలిచ్చి తమ వాదనను ప్రజలకు తెలియజేశారు.

1876 లో ధవళేశ్వరం విడిచి స్వస్థలం రాజమహేంద్రవరంలో ఆంధ్రోపాధ్యాయుడుగా చేరారీయన. దీనివల్ల తన ఉద్యమాన్ని మరింత శక్తితో ముందుకు నడపడానికి వీలు చేకూరింది.

కొందరి మిత్రులతో వీరేశలింగం 'స్త్రీ పునర్వివాహసమాజం' అన్న పేరుతో ఒక సంఘం ఏర్పాటు చేశారు. న్యాపతి సుబ్బారావు, చల్లపల్లి బాపయ్య, బసవరాజు గవర్రాజు, పైడా రామకృష్ణయ్య ప్రభృతుల సహకారం పంతులుగారికి లభించింది.

అనేక సమస్యలను ధైర్యంతో ఎదుర్కొని, ఎన్నో వ్యయ ప్రయాసలకోర్చి 1881 డిసెంబరు 11 న రాజ మహేంద్రవరంలో ప్రప్రథమ వితంతు వివాహం జరిపారు. వరుడు గోగులపాటి శ్రీరాములు. ఇతడు విశాఖపట్నం జిల్లా పోలీసు సూపరింటెండెంటు కార్యాలయంలో పనిచేస్తున్నాడు. వీరేశలింగం పట్ల ఇతనికి మిక్కిలి భక్తిప్రపత్తులున్నాయి. బాలిక కృష్ణాజిల్లా వాస్తవ్యురాలు. ఈ వివాహం పట్టణంలో పెద్దసంచలనం కలిగించింది. విధాయక వాదులీపెళ్ళి అపుచేయడానికి సర్వవిధాలా ప్రయత్నించారు. పురోహితులు రాకుండా చేశారు. చాకలి, మంగలి మొదలైన పనివారిని పెళ్ళిపని చేయకుండా అడ్డగించారు. అయినా వీరేశలింగం ఏమాత్రం చలించలేదు. వివాహం వైభవంగా నాలుగు రోజులు జరిపించారు. ఈ అపూర్వ సంఘటన దేశంనలుమూలలా తెలిసింది పత్రికలు, అభ్యుదయ సంస్థలు పలువిధాల ప్రశంసించాయి. ఈశ్వర చంద్ర విద్యాసాగర్ కలకత్తానుంచి ప్రత్యేక అభినందనలు పంపారు.

ఇవన్నీ పంతులుగారి పట్టుదలను ఇనుమడింపచేశాయి. బాలవితంతువుల తల్లిదండ్రులకు కూడ కొంత ధైర్యం ఏర్పడింది తమ చిన్నారి కుమార్తెలు తిరిగి నుదుట కుంకుమతో కళకళ లాడాలని భావించదొడగారు. తెలుగు నాడులోని పలుతావుల నుంచి వితంతు బాలికలను రాజమహేంద్రవరం తీసుకువచ్చి పంతులుగారికి అప్పగించడం మొదలు పెట్టారు. వీరేశలింగం దంపతులు వారినందరిని కన్నబిడ్డలమాదిరి ఆదరించేవారు. తగిన సంబంధం చూసి వివాహంచేసేవారు. పంతులు గారి సతీమణి రాజ్యలక్ష్మమ్మ నిజంగా సహనానికి మారుపేరు. సనాతన వాదులు వివాహాలకు ఎన్ని అడ్డంకులు కల్పించినా పెళ్ళిలో ఏలోటు రాకుండా చూసేదా ఇల్లాలు. గోదావరినుంచి స్వయంగా నీళ్ళు మోసుకు వచ్చి తానే వంటంతా చేసేది. ఆ యింట కులమత భేదాలు లేవు.

వివాహం చేయడంతో తమ బాధ్యత తీరిందని వారెన్నడూ భావించలేదు. నవదంపతులకు నివాస గృహం, కొంతపైకం సమకూర్చేవారు. వారి కష్ట సుఖాలు ఎప్పటికప్పుడు తెలుసుకుంటూ వుండేవారు. పంతులుగారికి ఉద్యోగం మూలంగావచ్చే వేతన పైకం, పరీక్షాపత్రాలు దిద్దినందుకు లభించే ప్రతిఫలం, మిత్రులిచ్చిన విరాళాలు అన్నీ తమ వుద్యమానికే వ్యయపరచేవారు.

స్త్రీలకు విద్య చాలా అవసరమని వీరేశలింగం నమ్మకం. "నాకు స్త్రీ విద్యయందును, స్త్రీల యభివృద్ధి యందును విశేషాభిమానము. స్త్రీలను ప్రస్తుత స్థితిలోనే యుంచి తాము పైకి లేచుట పురుషుల కెన్నడును సాధ్యముకాదని నేను దలంచుచుండెడి వాడను" అనే వారాయన. కాని నాటి సమాజం స్త్రీవిద్యను నిరసించేది. స్త్రీజనసముద్ధరణకు కంకణం ధరించిన పంతులుగారు సమాజం కల్పించిన కష్టాలను లెక్కచేయలేదు కోరంగివదలి ధవళేశ్వరంలో ఆయన ప్రధానోపాధ్యాయులుగా చేరారు. అక్కడ ప్రతి ఆదివారం విజ్ఞానోపన్యాసాలిచ్చి స్త్రీలు విద్యావంతులు కావలసిన ఆవశ్యకతను వివరించేవారు క్రమక్రమంగా ప్రజలకు పంతులుగారి ఉద్యమం ఎంత వుదాత్తమైనదో అర్థంకాదొడగింది. విరివిగా విరాళమివ్వడం మొదలు పెట్టారు. ఆ పైకంతో అక్కడొక బాలికా పాఠశాలను నెలకొల్పారాయన. ఆ రోజుల్లో స్త్రీలకు విద్యపనికిరాదని కొక్కొండ వెంకటరత్నం పంతులుగారు తమ 'భాషాసంజీవని' పత్రికలో తీవ్రమైన రచనలు ప్రచురించేవారు. స్త్రీవిద్యా నిషేధవాదుల ప్రతికూల వాదనను ఖండిస్తూ వీరేశలింగం 'పురుషార్థప్రదాయిని' లో అనేక వ్యాసాలు వ్రాసేవారు తమ వుద్యమానికి మరింత బలం చేకూరడంకోసం 'వివేకవర్ధని' పత్రిక

ప్రారంభించారు. ధవళేశ్వరంలో వుంటున్నప్పటికీ ప్రతివారం రాజమహేంద్రవరం వచ్చి అక్కడ ఉపన్యాసాలిచ్చేవారు. హితకారిణి సమాజం అధ్వర్యంక్రింద స్త్రీవిద్యావ్యాప్తికి పెక్కు సదుపాయాలు చేకూర్చారాయన. ప్రత్యేకంగా స్త్రీలకోసం 'సతీహితబోధిని' అనే మాసపత్రికను కూడా స్థాపించి అందులో ఉత్తమరచనలనేకం అందించారు. చక్కటి గ్రంథాలు రచించి ప్రచురించారు రాజమహేంద్రవరం తరలివచ్చాక కృషి ఇనుమడించింది. పంతులుగారు నెలకొల్పిన 'వితంతుశరణాలయం'లో వితంతువులకే కాక విద్యనిమిత్తం వచ్చినవారిని కూడా చేర్చుకునేవారు. ఈ శరణాలయంలో చేరినవారికి నెలకు అయిదేసి రూపాయలు చొప్పున ఇచ్చేవారు. దీనికి అనుబంధంగా వున్న పాఠశాలకు ఇతరమహిళలు నలుగురయిదుగురు మాత్రమే వచ్చేవారు. అందువల్ల కులస్త్రీలకోసం పంతులుగారు తమ యింటి మేడమీద ప్రత్యేకంగా 'జనానా తరగతులు' పెట్టి చదువుకు ఏర్పాటుచేశారు. రాజమహేంద్రవరంలోచక్కటిపాఠశాలస్థాపించారాయన. స్త్రీవిద్యావ్యాప్తికోసం ఇంకా ఎన్నో విధాలకృషి చేసి స్త్రీలోకానికి వెలుగు బాటలు చూపారు.

కారణాంతరాలవల్ల చెడుదోవత్రొక్కిన స్త్రీలను సమాజం హీనంగా చూస్తుంది. వారిని ఆదరించేవారుండరు. అట్టి వారిని చేరదీసి కాపాడి సన్మార్గంలోకి తీసుకురావడం కోసం పంతులుగారు పతితయువతీరక్షణశాల స్థాపించారు. అందులో గర్భవతులకు ఆయన భార్య స్వయంగా పురుడు పోసేవారు. వారంతా సన్మార్గంలోకి వచ్చేవారు. వీరేశలింగం వారిలో చాలమందికి వివాహాలుచేసి వారిజీవితాలను సుఖవంతంచేశారు.

అసలు సంస్కరణాభిలాష పంతులుగారికి ఒక విధంగా జన్మాంతరసంక్రమించింది. వీరేశలింగం పూర్వీకులు శైవబ్రాహ్మణులలోని ఆరువేల నియోగి శాఖవారు. ఈయన ముత్తాత చంద్రమౌళిగారికి స్మార్తులలోని శ్రీచూర్ణధారులకన్యనిచ్చారు. ఈయన తాత వీరేశలింగం లింగధారణ విరమించి సంస్కరణకు దారి తీశారు. పంతులుగారి సంస్కరణోద్యమం బహుముఖమైంది. బలీయమైంది. సంఘంలో తనకు కన్పించిన ప్రతి దురాచారాన్ని మూఢనమ్మకాన్ని తీవ్రంగా ఖండించారాయన. పత్రికాముఖంగా తీవ్రంగా దుయ్యబట్టేవారు, అవహేళన చేసేవారు. చక్కటి వ్యాసాలరూపంలో ప్రజలలో సంస్కరణాభిలాషను పెంపొందించేవారు.

వృద్ధ వివాహాలను నిరసిస్తూ 'బ్రాహ్మవివాహం' అనే ప్రహసనం రచించారు. దురాచారాల ఖండన కోసం 'హాస్య సంజీవని' అనే పత్రికకూడా వివేకవర్ధని కనుబంధంగా ప్రారంభించారాయన.

పడుపువృత్తిని మాన్పించి వారకాంతలను సన్మార్గంలో పెట్టడానికి పంతులుగారు కాయశక్తులాకృషి చేశారు. బహుళంగా రచనలు చేయడమే కాకుండా వేశ్యాప్రియులదగ్గరకువెళ్ళి వారికి హితబోధగావించేవారు. పొరుగూళ్ళనుంచి వచ్చిన వేశ్యాంగనలకు నచ్చచెప్పి తిరిగి తమతమ స్వగ్రామాలకు పంపించివేసేవారు సానిమేళాలు వ్యర్థమని వాదించి వాటి విజృంభణను కొంతవరకు తగ్గించడంలో వీరేశలింగం కృతకృత్యులయ్యారని చెప్పకతప్పదు.

దేశంలో మద్యపాన దురాచారం విశృంఖలంగా కొనసాగుతున్నది. పంతులుగారీదుర్వ్యసనాన్ని తీవ్రంగా ఖండించి, దీనిని నిర్మూలించడానికి ఇతోధికంగా యత్నించారు. ఈయన తోటలోవున్న తాటిచెట్లవలన సాలుకు డెబ్బై రూపాయలరాబడి వచ్చేది. త్రాగుబోతుతనము దేశములోని యనేకానర్థములకు మూలమనియు దానిని సాధ్యమైనంతవరకు మాన్పింపజూచుట ప్రజాక్షేమమును గోరెడు దేశాభిమానులకెల్ల కర్తవ్యమనియు నా యభిప్రాయము. అందుచేత నేను తోటలోని తాటి

చెట్లను కల్లుగీచుట మానిపించి యందువలన వచ్చు ధనాగమమును లోగొట్టితిని తోటలో నడుమగా నున్న యీతచెట్లను తాటిచెట్లను కొట్టించివేసి ... అని వ్రాసుకున్నారాయన స్వీయచరిత్రలో.

ఇక లంచగొండులపైన అవినీతి పరులపైన పంతులుగారి నిశితవిమర్శలు ఆయన ధైర్యానికి మచ్చుతునకలు. జంకులనేది ఆయనకు తెలియని మాట. 'వివేకవర్థిని'లో లంచగొండులమీద ఆయన వ్రాసిన రచనలు ఆయనను చాలసార్లు కోర్టుల కెక్కించినాయి.

ఆ రోజులలో న్యాయపరీక్షలో వుత్తీర్ణులు కాని వారికి కూడ పట్టాలిచ్చేవాడుక వుంది అది అన్యాయమని పోరాడి పంతులుగారావద్ధతి మాన్పించగలిగారు. న్యాయస్థానాల్లో సయితం అక్రమాలుజరుగుతుండేవి. ఒకసారి యిట్టి అన్యాయాన్ని బట్టబయలు చేయడం కోసం పంతులుగారు న్యాయాధికారి చిత్తువ్రాసి చించి పారవేసిన కాగితపు ముక్కలను ఏరిపించి వాటితో గ్రంథం నడిపి ఆ న్యాయాధికారికి మరుపురాని గుణపాఠం నేర్పారు.

అన్యాయం ఎక్కడకన్పించినా పంతులుగారిని దానిని నిర్మోహమాటంగా ఎదుర్కొని, తుద ముట్టించేవరకు విశ్రమించేవారు కారు. ఒక పర్యాయం పంతులుగారు రాజమహేంద్రవరంలో ధర్మవైద్యశాలలకు వెళ్ళారు. అక్కడవున్న రోగులకు పాలు, రొట్టె ఇస్తున్నట్లు లెక్కవ్రాసుకుని కేవలం గంజిమాత్రం పోస్తున్నారు. ఈ వివరాలు రోగులనడిగి తెలుసుకుంటుండగా వైద్యశాల ప్రధానాధికారి రంగయ్యగారు పంతులుగారిని వారించారు. ఆ సంగతి పంతులుగారి పురపాలకసంఘానికి తెలిపి చర్య కుపక్రమించారు. చివరకు రంగయ్య అట్టి అక్రమాలు జరుగకుండా చూస్తానని హామీ ఇచ్చి క్షమాపణ చెప్పుకున్న మీదట తమ చర్య మానుకున్నారు.

పురపాలకసంఘసభ్యుడుగా వీరేశలింగం చేసిన కృషి రాజమహేంద్రవాసులెన్నటికీ మరువరు. దాని ఆదాయంపెంచి, సంఘకార్యకలాపాలలో నిజాయితీని, చిత్తశుద్ధిని ఇనుమడింప చేశారు. కార్యాలయంలో అలసత్వమంటూ లేకుండా చేయగలిగారు. ఆయన శ్రద్ధకొక వుదాహరణ: పట్నాల వీరేశలింగం అనే ఆసామి పెద్దవీధిలో పురపాలక సంఘం స్థలాన్ని ఆక్రమించుకుని పునాదులు ముందుకు జరిపి గోడలేవదీయడానికి పూనుకున్నాడు. ఇది కనిపెట్టిన పంతులుగారు తగు చర్య జరిపించి దగ్గర వుండి ఆక్రమించిన భాగంలోని వీధి అరుగులను, గదిని పడగొట్టించారు. అలాంటిది పంతులుగారి పట్టుదల.

ఆరోగ్యం ఏమాత్రం అనుకూలంగా లేకపోయినా సంస్కరణోద్యమాన్ని యథాప్రకారం కొనసాగిస్తునే వచ్చారు. ఆయన ఆంధ్రసీమలో నవచైతన్యాన్ని వుద్దీపింపచేశారు. నవ్యాంధ్రనిర్మాత ఆయన.

సాంఘికరంగంలో ఆయనకృషి ఎంతఘనమైనదో బృహత్తరమైనదో సాహిత్యరంగంలో కూడ ఆయన కృషి అంతటిదే.

బాల్యంలోనే 'మార్కండేయ శతకం', 'గోపాల శతకం' కందపద్యాలలో రచించారు. అసలు 'శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నైషధంతో గ్రంథరచన ప్రారంభమైందని చెప్పవచ్చు. ఈ గ్రంథాన్ని విశ్వవిద్యాలయం పట్టపరీక్షకు పాఠ్యగ్రంథంగా నిర్ణయించింది. చిత్రాంగ దాపరిణయ గాథను ఇతివృత్తంగా స్వీకరించి రచించిన మిశ్ర ప్రబంధం 'రసిక జనమనోరంజనం' పండితుల ప్రశంసలందుకొన్నది దీనిలో ఎక్కువభాగం విద్యార్థిదశలో

వ్రాసివచే. 'గోదావరి విద్యాప్రబోధిని,' 'పురుషార్థ ప్రదాయిని' వంటి పత్రికలలో అనేకరచనలు చేస్తూ వుండేవారు. కోరంగిలో వుండగా పంతులుగారు 'సంగ్రహవ్యాకరణం' 'నీతి దీపిక' రచించారు.

తెలుగులో గద్య కావ్యాలు అవసరమని గ్రహించి 'నీతిచంద్రిక' పూర్తిచేసి ప్రచురించారు. మనలోవున్న మూఢ విశ్వాసాలను పోగొట్టాలనే వుద్దేశంతో 'రాజశేఖరచరిత్ర' వ్రాశారు. బాల్య వివాహాలను ఖండిస్తూ 'బ్రాహ్మవివాహం' అనే ప్రహసనం రచించారు. 'వ్యవహారధర్మబోధిని' అనే ప్రహసనం ప్లీడరునాటకమని మంచిపేరు పొందింది.

ధార్వాడనాటక సమాజంవారు రాజమహేంద్రవరం వచ్చి ప్రదర్శనలిస్తున్నప్పుడు వారి కోరికమీద శ్రీహర్షుని 'రత్నావళి' షేక్స్పియరు కామెడి ఆఫ్ ఎర్రర్స్ తెనిగించి వారిచేత ప్రదర్శింపచేశారు 'వ్యవహారధర్మబోధిని' వ్యావహారికభాషలో రచించారు కాళిదాసు 'అభిజ్ఞానశాకుంతలం' తెనిగించారు తరువాత 'మాళవికాగ్నిమిత్రం' కూడా పూర్తిచేశారు. అద్వైతమత సిద్ధాంతాన్ని ప్రబోధించే నిమిత్తం పంతులుగారు 'ప్రబోధచంద్రోదయం' అనే వేదాంత నాటకం రచించారు.

పంతులుగారి 'ప్రహ్లాదనాటకం' మంచి ప్రచారం పొందింది. షెరిడన్ 'డ్యూయన్నా' ఆధారంగా వ్రాసిన నాటకం 'రాగమంజరి' విరాటపర్వంలోని దక్షిణగోగ్రహణ కథను అయిదంకాల నాటకంగా వ్రాశారు. తరువాత 'హరిశ్చంద్రోపాఖ్యానం' నాటకంగా రచించారు పురోహితులుపెట్టే చిక్కులను వర్ణిస్తూ 'తిర్యగ్విద్వన్మహాసభ' అనే ప్రహసనం వెలువరించారు. 'మహారణ్య పురాధిపత్యం' కూడా ఆక్షేపగర్భ నాటకమే. షెరిడన్ 'దిరైవల్స్' ను 'కల్యాణకల్పవల్లి' పేరిట ఆంధ్రీకరించారు.

స్త్రీలకవసరమైన సాహిత్యంపట్ల పంతులుగారు ప్రత్యేక శ్రద్ధ వహించేవారు. తమ 'సతీహితబోధిని' మాసపత్రికలో ఎన్నోఅమూల్యమైన రచనలు ప్రచురించారు. 'చంద్రమతీ చరిత్ర', 'సత్యసంజీవని', 'సత్యరాజా పూర్వదేశయాత్రలు', 'నీతికథా మంజరి', 'దేహారోగ్యధర్మబోధిని', 'పత్నిహిత సూచని', 'సత్యాద్రౌపదీ సంవాదం', 'మాతృపూజ', 'పితృపూజ' వంటి గ్రంథాలు అందించారు.

ఇవేకాదు శరీరశాస్త్రం,జ్యోతిశ్శాస్త్రం, జంతుశాస్త్రం, అలంకారశాస్త్రం తర్కం మున్నగు వాటికి సంబంధించి పెక్కు గ్రంథాలు రచించారాయన.

ఆయన 'ఆంధ్రకవుల చరిత్ర' ప్రధానమైన గ్రంథం. జీవనుచరిత్రకూడా వ్రాశారాయన.

వీరేశలింగం తవసంస్కరణోద్యమంతో, చైతన్యపూరితమైన రచనా స్రవంతితో ఆంధ్రజాతిలో నవతేజాన్ని వెల్లివెరియింపచేశారు.

మద్రాసునగరంలో జరిగిన బ్రహ్మాండమైనసభలో శ్రీ మహాదేవగోవింద రెనడే ఈయనకు 'దక్షిణ హిందూదేశ విద్యాసాగరు' డనే బిరుదం ఇచ్చారు. ఈయన అమూల్యసేవలను గుర్తించి ప్రభుత్వంవారు 'రావుబహదూర్' బిరుదం ఇచ్చారు. నిజంగా ఆయన బిరుదాలకు అతీతులు. నిష్కామసేవ ఆయన ధ్యేయం. ఆయనకు కావలసింది ప్రజాశ్రేయస్సు, లోకాభ్యుదయము. అందుచేతనే ఆయన తమ అనారోగ్యాన్ని ఎప్పుడూ లక్ష్యపెట్టలేదు.

1910 లో పంతులుగారికి సతీవియోగం కలిగింది. ఉద్యమ సాధనలో అన్నిటా బాసటగా నిలిచిన ధర్మపత్ని మరణించడం ఆయనకు పెద్దలోటు తీర్చింది. అయినప్పటికీ పంతులుగారు తమ ఉద్యమాన్ని, బహుముఖకృషిని సడలించలేదు.

మరో తొమ్మిది సంవత్సరాలు పంతులుగారు ప్రజాసేవ, సాహిత్యసేవచేసి 1919 మే 27 వ తేదీన పరమపదించారు.

ఆయన వెలిగించిన సంస్కరణజ్యోతి దేశం నలువైపులా ఉజ్జ్వలకాంతులీనుతున్నది. పురమందిరం హితకారిణి సమాజం, వీరేశలింగం స్టేట్ హోం, వీరేశలింగం ఆస్తికోన్నతపాఠశాల, ప్రార్థనమందిరం, వీరేశలింగం గ్రంథాలయంవంటి ప్రజాహితసంస్థలెన్నో నేటికీ రాజమహేంద్రవరంలో పనిచేస్తూ ఆయన ఉద్యమాన్ని నిత్యం మనకు స్మరణకు తెస్తున్నాయి.

వీరేశలింగంగారు మహామనిషి. నవయుగకర్త. నిజంగా ఆయన కారణజన్ముడు. ముఖ్యంగా మహిళాలోకం ఆయనను ఎన్నటికీ మరువలేదు. తెలుగు సాహిత్యం ఆయన అమూల్య గ్రంథావళితోసు సంపన్నమైంది. తెలుగుజాతి, దేశప్రజ ఆయన వినిపించిన సంస్కరణ శంఖారావంతో జాగృతమైనాయి.

ఆయన ధన్యజీవి, త్యాగమూర్తి, మహాత్ముడు, మార్గదర్శకుడు. ప్రజాసేవకు మారుపేరుగా నిలిచిన మహాపురుషుడు.

●

"ఆగస్టు 19 వ తేది శనివారమున శ్రీ పిఠాపురం రాజాగారి అనాధశరణాలయము యొక్క ఉపాసనా మందిరమున అనాధశరణాలయములో శ్రీ రాజాగారివలన పెంపబడుచున్న శ్రీమతి నారాయణమ్మకును, ఈ పూరి పాలెము కాపురస్థుడును అచ్చటి ప్రార్థన సమాజ సభ్యుడును అయిన శ్రీమాన్ బూదాటి రామలింగము గారికిని వివాహామతివైభవముతో జరుపబడెను. తత్సమయమున రా.బ. కందుకూరి వీరేశలింగముగారాచార్యత్వమును వహించిరి.

"ధర్మసాధని", ఫిబ్రవరి 1, 1918 సం. 5, సం. 8.

# సంస్మరణ

శ్రీమతి కొండపల్లి కోటీశ్వరమ్మ

నిరాశతో నీరుకారిపోయే సోదరులకు
భరోసానిస్తూ,
ఎడారిలో కన్నీరు నింపవద్దని,
హృదయంలేని మరుభూమి సశ్యాలు ఫలించవని,
నవ ధర్మాల నలుమూలల వ్యాపింప జేస్తూ
బాధితులకు ఓదార్పు నిస్తూ
నిండు హృదయంతో పండి పోయేవరకు సేవలు జేసిన
మన కందుకూరిని స్మరిద్దాం !
జాతిని ముసిరే చీకటుల చీలుద్దాం !
మనలో నున్న వన్య మృగాల జయిద్దాం !
నేడు మోసాలు చేస్తూ
మేకల వేషాలతో తిరిగె పెద్దపులులు,
లంచాల చెదపురుగుల వెండి కంచాలందుంచుకుతినే
ఎలుగు బంట్లూ,
అధికార గర్వపు జూలు విదిలిస్తూ
వళ్లు మరచి గర్జించే సింహాలు
పొట్టలు సవరించుకొంటు పదవుల జపమాల
పట్టుకు తిరిగే జంబుకాలు

వరదక్షిణ సులోచనాల, పుట్టిని చూస్తు
స్వర్గానికి పాకాలనే మార్గాలాలు,
మోక్ష సాధనంటూ ముక్తికే పత్రాలంటు
పంచభక్ష పరమాన్నాలు తింటు
ఎంగిలి తినిపించె బాబా పనుగులు
నీతి కుసుమించిన ఆంధ్ర బృందావని విహరించకముందే.
కరుణ పరిమళించిన తెలుగుభూమి ఈ వన్య మృగాల
కాలవాలంకాకముందే దుర్మార్గంచెదరేలా అమానుషత్వం చెదరేలా
పంతులుగార్ని స్మరిస్తూ క్రాంతి పథాన నడుద్దాం !
యుగ పురుషుల గుర్తుచేస్తూ నడుముగట్టి నడచేలా
నవయువకుల ప్రభావితం చేద్దాం !
నవతకు జే జేలర్పిద్దాం !
నీరసించె తెనుగుజాతికి నీతిఓషధినిస్తూ
తెనుగు తల్లి ఖ్యాతిని నిలుపుదాం !



" హనుమంతరావు నాయుడుగారి శుశ్రూష, రాజమహేంద్రవరంలో వీరేశలింగం బంతులు సంస్కరణోద్యమము, కొంత వరకు నాలో రాజకీయాభిలాషలు రేకెత్తించాయి "

ఆంధ్రకేసరి " నా జీవిత యాత్ర "—

# సారస్వత యోధుడు

స్వర్గీయ కె. ఎన్. కేసరి

"నేను మద్రాసునకు వచ్చిన కొంతకాలమునకు పంతులుగారు ప్రెసిడెన్సీ కళాశాలకు ఆంధ్ర పండితులుగా వచ్చిరి. 1904 లో కాబోలు వారా పదవినుండి విరమించిరి. ఆ మధ్యకాలమున అప్పుడప్పుడు వారిని దర్శించుట తటస్థించుచుండెను. తలపాగా, చాదుబొట్టు, తెల్లని మీసములుగల అప్పటి వారి ముఖవిలాసము ఇంకను నాకు మరుపు రాలేదు. పిమ్మట వారప్పుడు చేయుచుండిన స్త్రీ జనోద్ధరణ, సంఘసేవలను గూర్చి తరచుగ వినుచుంటిని. ఆ కాలమున వారు వ్రాసిన గ్రంథ రాజములను నేను చదువుచుంటిని. ఆంధ్రదేశమున స్త్రీపురుషులు వీరి నవలలను, ప్రహసనములను, నాటకములను విడువక చదువుచుండిరి. విద్యాలయములలో కూడ వీటిని పాఠ్యగ్రంథములుగ నిర్ణయించి యుండిరి. ఈ కారణములచే స్త్రీలలో మంచి సారస్వత చలనము కలిగినది. అప్పటి నుండియే మన ప్రాంతమున స్త్రీ విద్యాభివృద్ధికి ప్రారంభమని చెప్పవచ్చును.

శ్రీ వీరేశలింగంగారు నాటి ప్రజలలో కలిగించిన విజ్ఞాన ప్రభావముయొక్క ఫలితముగా పెళ్ళిళ్లు వీరి గ్రంథరాజములనే కట్నములుగా వధూవరులకు చదివించుచుండిరి. ఇందుకనుకూలముగా శ్రీ పంతులుగారు తమ గ్రంథములన్నిటిని 10 వాల్యూములుగా అచ్చొత్తించి రు. 16 లకు విక్రయించెడివారు. నేను కూడ నా స్నేహితుల వివాహములందు ఈ గ్రంథములనే చదివించుచుంటిని" —

—"నా చిన్ననాటి ముచ్చట్లు".

❋

"మనుష్యుడు న్యాయమార్గమున కష్టపడిన పక్షమున తగిన ఫలము కలుగక పడినను పోకెప్పుడును వ్యర్థముగా పోదు."

1878 అక్టోబరు వివేకవర్ధని.

# మహాపురుషుడు

స్వర్గీయ శేషాద్రిరమణ కవులు

ఆంధ్రవాఙ్మయమునకు నూతన పరివర్తన దశ సమకూర్చి గతించిన శ్రీ రావుబహద్దూరు వీరేశలింగము పంతులుగారి మరణము విచారమున ముమ్ము ముంచివేసినది. మానవకోటికి మరణము నిత్యమేగాని ఆంధ్రభాషా భూషణమనదగు నాంధ్రకవుల చరిత్రము కడమ రెండు భాగములు వీరు సవరింపబూనియు కృతార్థులుగామిచే వీరియాత్మకే గాక భాషా సేవకులకు సైతము శాంతి తొలంగినది. ఆంధ్ర కవుల చరిత్రములోని మొదటిభాగము సవరణ చాలవరకు బాగున్నది. ముఖ్యముగ నన్నెచోడుడు, శ్రీనాథుడు, బమ్మెరపోతరాజు మొదలగు కవుల జీవితమున నొనరించిన చర్చ మనోహరముగ నున్నది. నన్నెచోడుని జీవితకాల నిరూపణమున పంతులవారు చూపిన సామర్థ్యము వర్ణనాతీతము. వారి మేధవిమర్శ పటుత్వము వా భాగము జూచినచో గననగును. రెండవ భాగమున భాముక్తమాల్యదను గూర్చి వ్రాయుచు గతించిరి. రెండవభాగమున చేర్పదగిన కవుల చరితములు సంగ్రహించిరి చరిత్ర నిర్మాణమునకు బునాది గల్పించిరి. చర్చనీయాంశముల దృష్టి విధమున నుంచుకొనిరి. ఇక లేఖిని పనియేగాని భావనాశక్తి పనిలేదు. ఈ వక్వదశలో గీర్తిమూర్తిని ధరింపవలసివచ్చిన వీరేశలింగకవి స్థూలదేహము చరిత్ర జిజ్ఞాసువులకు బరితాప జనకమయ్యెను.

ఆంధ్రకవుల చరిత్రము సంస్కరించుచు రెండవ భాగములోని కవుల విషయమై సహాయము చేసించిరి. మాకు తెలిసిన కవులగూర్చి చరిత్రముఖమున ప్రచురించుటకు వ్యవధి కలదని వీరేశలింగము పంతులవారి చెంతకు బంపి గ్రంథస్థముగావింపమైతిమి. ఇంతలో కాలము ముగింపునకు వచ్చినది. భాషాసేవకులలో నేరేని వాఙ్మయరంగమున జరిత్రకార భూమి కధరించి మిగిలిన రెండుభాగముల కవిచరిత్రములు సంస్కరించి వాఙ్మయవృద్ధికై పాటుపడి సంకల్పసిద్ధముగాని పంతులవారి ఆత్మకు శాంతి సమకూర్చుట కర్తవ్యమని భాషాసేవకులకు విన్నవించెదము.

(వీరేశలింగంగారు 1919 మే 27 న పరమపదించగా, అప్పుడు శేషాద్రి రమణ కవులు వెల్లడించిన సంతాపము. ఇది కృష్ణాపత్రిక, జూన్ 7 సంచికలో ప్రకటితము)

# వీరసంస్కర్త

## స్వర్గీయ వల్లూరి సూర్యనారాయణరావు

ఆ 1878 సం॥లో నేను రాజమహేంద్రవరము గవర్నమెంటు కాలేజిలో నాల్గవ ఫారములో చేరినప్పటినుండియు కందుకూరి వీరేశలింగంపంతులు గారు మాకు ఉపాధ్యాయులుగా నుండి ఒక్క తెలుగేగాక మరికొన్ని గ్రంథములలో కూడా పాఠములను చెప్పుచుండిరి. ఈయన మెట్రిక్యులేషన్ ప్యాసై ధవళేశ్వరము స్కూలులో హెడ్డుమాష్టరుగా నుండి కాలేజికి ఉపాధ్యాయుడుగా అప్పుడే వచ్చిరి. ఈయన యలవాటును బట్టియు మేము పాఠములను సరిగా వల్లించలేకపోబట్టియు క్లాసులో యేవియో లోకాభిరామాయణములలో దింపే వారము. మా కోమలమనస్సునకు నాటునట్లుమాకు ఉగ్గుపాలతో సంఘసంస్కరణలను గురించియు సాంఘిక మూఢ విశ్వాసములను గురించియు చిత్ర విచిత్రముగ ఉపదేశించుచుండిరి. పూర్వపు రాతి బొమ్మలనన్నిటిని బ్రద్దలుకొట్టుటే యీయన పరమావధి, ఆంధ్రకవుల అతిశయోక్తులు, అలంకారములు యీయన తలకెక్కవు. వానినెల్లప్పుడు యీసడించేవారు. సంస్కృత నాటకములను యాంధ్రీకరణచేసి మాకు వినిపించేవారు. స్వకపోల కల్పితములగు ప్లీడరు నాటకము మొదలైనవి మాచేత ఆడించేవారు. ఈయన కలమునకు అడ్డు తగిలేవారు లేకపోయిరి. ప్రతివారము వివేకవర్ధనిలో విశాఘాటముగ సాంఘికాచారములను ప్రహసనముల మూలమున విమర్శించేవారు. ఆ 1981 వ సంవత్సరములో వితంతు వివాహములు శాస్త్ర సమ్మతము కావని అనేక గొప్ప పండితులు ఈ నిరుపమానయాంధ్ర పండితునియందు గౌరవము చేతనే యీయనను ఒప్పించుటకు, విజయనగరం మహారాజా వారి బాలికాపాఠశాలలో సమావేశమై యీయనతో ప్రతివారము బహిరంగ సభలలో చర్చలు జరిపిరి.

విద్యాసాగరుల వారి యభిప్రాయములే సరియని త్రికరణశుద్ధిగా నమ్మి ప్రథమ వితంతు వివాహము మిక్కిలి వైభవముతో లక్షాధికారియగు పైడా రామకృష్ణయ్యగారిచ్చిన ద్రవ్యముతో జరిపిరి. మా కాలేజిబాలురందరము వివాహమునకు వెళ్ళితిమి. వివాహము జరిపిన పురోహితుడు మా మండపేట కాపురస్తుడే. ఆ రాత్రి మా యింటి వద్దనే పండుకొని మరునాడు యెవరికి కనుపడకుండ వెళ్ళిపోయినాడు. మాపంతులుగారిమాట కెన్నటికిని అడ్డుచెప్పక ఆ కాలములోనున్న మేము 600 మంది విద్యార్థులము, ప్రతి వీధిలోను, సందులోను ఆయన కెట్టి హానియు కలుగకుండ లాటీకర్రలతో జాగరణ చేసితిమి. మేమాపునర్వివాహదినములలో అక్కడ భోజనముచేసినను, తాంబూలము పుచ్చుకొన్నను మమ్ములను వెలివేయుటకు సాధ్యపడకపోవుటచే, పెద్దలు చేయునదేమియు లేక మిన్నకుండిరి. కొందరు పెద్దలు మొదట ఆయనతో చేరిరి. గాని ఒక్క బసవరాజు గవర్రాజుగారు తప్ప తక్కినవారు ప్రాయశ్చిత్తము చేయించుకొనిరి. మాలో కొందరము కాలేజిలో రోడ్డుప్రక్కనున్న చెట్లకొమ్మలకు మాయజ్ఞోపవీతములను తగిలించి మార్గస్థులను వృథాగా కవ్వించుచు మా సంఘసంస్కరణాభిలాషను ప్రకటించుకొనుచుంటిమి. ......”

(—స్వీయ చరిత్రము)

# వీరేశలింగం పంతులు

స్వర్గీయ ఉమాకాంత విద్యాశేఖరులు

పంతులుగారు చనిపోయినారని విన్నప్పుడు అయ్యో! పోయినా డొక గొప్పపురుషుడు అని అనుకొంటిని. చిన్నచిన్న నీతి కథలు చదువు కొనే పిల్లవాడు మొదలు పెద్ద గృహస్థుని వరకు పంతులుగారిని ఎరిగినవారేగాని యెరగనివారెవరో!

పంతులుగారి గొప్పతనము ఏవిధమైనది? ఆచార్యుడుగానా? కావ్యకర్తగానా? అవే ప్రశ్న నన్ను అనేక పర్యాయములు బాధించినది. పంతులుగారితో మాటలాడి కొంత తెలుసుకోవచ్చుననుకొంటిని. మాటలాడకపూర్వము ఉన్న అభిప్రాయము మాటలాడిన తరువాత దృఢపడ్డది. నిస్సంశయముగా పంతులుగారు గొప్ప ఆచార్యుడని అనుకొంటిని.

బసవేశ్వరునివంటి ఆచార్యులు పుట్టిన కాలములు వేరు. ఆచారములకు మతములకు, గతులను చాలా మట్టుకు రాజాస్థానములు నిర్ణయించుచుండిన కాలములవి. రాజులకుడిచేయి పట్టుకొనగలిగిన ఆచార్యుడు తక్కిన ఆచారముల తలవంచుచుండును. ఆ ఆచార్యుడు మనుష్యాతీతుడని భగవంతుని అవతారమని భక్తులు విశ్వసించినారు అప్పటికి బౌద్ధుల తర్కపు సుడిగుండములు పూడిపోయినవి. ఆచార్యుల చరిత్రలు అమానుషమైన మహిమలతో నిండినవి. అప్పటికాలంలో పుట్టితే పంతులుగారు ఎటు వంటి ఆచార్యులుగా వెలసియుందురో యెవరెరుగుదురు.

కాని పంతులుగారు పుట్టినది మరియొక కాలము, యూరోపుఖండపు శాస్త్రవాదములు మనదేశమున అల్లుకొన్నవి. సాధారణముగా జనులలో తర్కజ్ఞానము మొలక యెత్తినది. ఆచారము జోలికి పోమని రాజులు తటస్థులుగా ఉండిరి. నీతిబలము లేని పురోహితులు సర్వాధికారులు. ఈ సర్వాధికారులకు సమ్మతులైన అప్పటి తెలుగు ప్రజకు అసత్యము ప్రయోజకునివని. వ్యభిచారము పురుష లక్షణము. పంతులుగారికి వయస్సువచ్చినప్పటికి ఉన్న తెలుగుదేశపు స్థితియిది.

ఈ దురాచారములను మాన్పుటకు తెలుగు దేశమునకు ఈ స్థితిని తొలగించుటకు పంతులుగారు నడుముకట్టుకొనిరి లోకమునందెన్నో యుద్ధములు జరిగినవి ఎందరో శూరులు పోరాడిరి. దురాచారములతో సంభవించిన పెద్దయుద్ధములో పోరాడిన ఈ శూరుడు ఏ యుద్ధమునందలి ఏ శూరునికి తీసిపోడు.

పంతులుగారికి ఎవరియందును విశ్వాసములేదు. తగని కోపము అనేమాట వాస్తవము. దుర్నీతి పక్షమున చేరి పంతులుగారిని అనేకులు బాధపెట్టిరి.

